# చందమామ

ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు

ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకోవటం వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా ఘన పరిశోధనం వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలిచే దాని పిప్పర మెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...




...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

నవజ్యోతి ఫిలిమ్స్

# పట్టుకుంటే పదివేలు

నిర్మాతలు:
సాంబశివరావు, వందనం

దర్శకత్వం:
ఎం. మల్లికార్జునరావు

సంగీతం:
టి. చలపతిరావు

కెమేరా:
లక్ష్మణగోరే

ఈస్టిండియా రిలీజ్



Moulis




సోల్ సెల్లింగ్ ఏజంట్లు :—

ది బెంగాల్ ఎలక్ట్రికల్ కంపెనీ,

బెంగళూరు - 3, మదరాసు - 17

★

ఆంధ్ర :

జి. ఏ. పరశురాం కంపెనీ,

లకాడికా పూల్,

హైదరాబాదు - 1.

# ఊరగాయ పచ్చళ్లకు అమూల్యమైన నూనెలు

అగ్‌మార్కు కాబడిన ఎ.యస్.బ్రాండ్ చాయపప్పు నూనె







అగ్‌మార్కు కాబడిన మేన్షన్‌బ్రాండ్ నువ్వులనూనె

ముక్కను మెత్తబడనీయవు......

బూజుపట్టనీయవు......

చాలకాలము నిలువయుండును.

16, 4, 2. కిలోగ్రాముల డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.....

ఇండియన్ గవర్నమెంటువారి అగ్‌మార్కు సీలునుగమనించి కొనుడు.

ఏజంటు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమిషను మర్చంటు, విజయవాడ

డిపోలు :

శ్రీ జి. సుబ్బారావు,
డాక్టరు వుళ్ళక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ బి. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజామువలియార్ స్ట్రీటు,
కలాసిగుడ, సికంద్రాబాద్.

MFRS, అంబటిసుబ్బన్న & కో. సామర్లకోట

"ప్యారీ మిఠాయిలు దొరికాయి ఇంక నీకెందుకలా—!"

ప్యారీ మిఠాయిలు వద్దనగలమా.
ఎంతో రుచికరము పుష్టికరము.
పంచుకోండి ఆనందించండి.
ప్యారీ మిఠాయిలతో జీవితం.
ఆటగా సాగిపోతుంది.
వీటిని వాడారా:
జింజెర్ క్యాప్స్
డెవాన్ క్రీమీ టాఫీ
లాక్టో బాన్ బాన్స్
హెల్త్ ఫ్రూట్స్




విశిష్టరకపు
మిఠాయిలను
తయారుచేయువారు.

ప్యారీస్
కన్ఫెక్షనరీ లిమిటెడ్,
మద్రాసు.

PRS 4024A



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మార్చి సంచికలో "చదువురాని సామంతు" అన్న కథలో ఎంతటి వాడికైనా చదవటమూ రాయటమూ వచ్చి తీరాలన్న నీతి తెలుసుకున్నాం. "నేను ప్రభువును ; చదువు వొచ్చిన వాళ్ళ నెంత మందినైనా పెట్టుకోగలను," అనుకోవటం అవివేకం. అలాగే, నేను రాజును ; అన్ని వృత్తి విద్యల వాళ్ళనూ పోషించగలను. నే నేవిద్యా నేర్చుకో నవసరం లేదు," అనుకోవటం కూడా పొరపాటే. ఈ నీతిని మనం ఈ సంచికలో 'వృత్తివిద్య' అన్న కథలో చూస్తాం.

సంపుటి 40 మే '67 సంచిక 5

CHITRA



# భారత చరిత్ర




కలకత్తా గ్రామం నగరంగా పెరిగింది. 1735 నాటికి అక్కడి జనసంఖ్య లక్ష అయింది. అక్కడి రేవులో ఏటా పదివేల టన్నుల సరుకు కదిలేది. పడమటి తీరాన మటుకు ఇంగ్లీషువాళ్ళ వర్తకం 18 సంవత్సరాల పాటు దెబ్బ తిన్నది. దానికి కారణం మరాఠీ నౌకాధిపతులకూ, పోర్చుగీసువారికీ మధ్య సాగిన సంఘర్షణే. అటు తరవాత ఇంగ్లీషు వ్యాపారం బాగానే సాగింది. 1744 నాటికి బొంబాయిలోని జనసంఖ్య 70,000. 1739 లో ఇంగ్లీషు కంపెనీ పేష్వాతో ఒప్పందం చేసుకుని, మరాఠీ నౌకాధిపతులపై యుద్ధాలు చేసి, వారి స్థావరాలైన సువర్ణదుర్గం, ఘేరియాలను పట్టుకున్నది. ఘేరియాను పట్టుకున్నవారిలో క్లైవ్ కూడా ఉన్నాడు.

ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు సూరత్, మచిలీపట్టణం నగరాలలో ఫాక్టరీలు స్థాపించారు. 1674 లో పుదుచ్చేరి గ్రామాన్ని సంపాదించి, ఫ్రెంచి వలసగా అభివృద్ధి చేశారు. 1706 నాటికి పుదుచ్చేరి లోని జనసంఖ్య 40,000 (ఆ ఏడు కలకత్తా జనసంఖ్య 22,000 మాత్రమే). 1725 లో మాహే, 1739 లో కారైకాల్ వారి అధీనంలోకి వచ్చాయి. చాలా కాలం ఫ్రెంచివారు తమ వ్యాపారం మాత్రమే చూసుకున్నారు. కాని 1742 లో వారికి రాజకీయ తృష్ణ పుట్టుకొచ్చింది. భారతదేశంలో ఫ్రెంచిసామ్రాజ్యం నెలకొల్పాలని డూప్లే సంకల్పించాడు. ఈ విధంగా బ్రిటిషు వారికీ, ఫ్రెంచివారికీ మధ్య సంఘర్షణ ఏర్పడి, భారత చరిత్రలో ఒక కొత్త అధ్యాయం సృష్టి అయింది.

ఇరవైఏళ్ళపాటు కర్ణాటక ప్రాంతంలో ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ సంఘర్షణ కొనసాగి, చివరకు భారతదేశంలో ఫ్రెంచి



వారి అధికారం అంతరించింది. దీని ఫలితంగా భావి భారత భాగ్య విధాతలు ఇంగ్లీషు వారే కాని, ఫ్రెంచివారు కారని కూడా స్పష్టమయింది. ఈ సంఘర్షణ వల్ల దేశానికి అనుకోని పరిణామాలు జరిగిన కారణంగా కర్ణాటక యుద్ధానికి మన చరిత్రలో ప్రాముఖ్యం ఏర్పడింది.

నిజానికి ఈ సంఘర్షణ అతి క్షుద్రమైన వ్యాపార పోటీగా ప్రారంభమై, క్రమంగా పెరిగి, మొగలు సామ్రాజ్యాన్ని కబళించటానికి జరిగిన యుద్ధంగా పరిణమించింది.

కర్ణాటక (కొరమండల్) తీరాన ఇంగ్లీషు వర్తకానికి మద్రాసూ, ఫ్రెంచి వర్తకానికి పుదుచ్చేరీ ముఖ్య కేంద్రాలుగా ఉండేవి. రెండూ రక్షణ బలాలతో కూడిన నగరాలే. ఒక్కొక్క నగరంలోనూ సుమారు 500 మంది తెల్లవాళ్ళూ, 25,000 మంది భారతీయులూ ఉండేవారు. పుదుచ్చేరికి కొంచెం దక్షిణాన ఉన్న సేంట్ డేవిడ్ కోట ఒకటి ఇంగ్లీషువారికి అదనంగా ఉండేది. ఈ మూడు నగరాలూ సముద్ర తీరాన ఉన్నవే. వీటిని రక్షించు కోవాలన్నా, ఈ నగరాలలో సరుకులు దించుకోవాలన్నా సముద్రంపైన ఆధిపత్యం అవసరం. స్థానిక ప్రభుత్వాలకు నౌకాబలాలు లేని కారణం చేత సముద్రాధి



పత్యపు పోటీ పూర్తిగా ఇంగ్లీషు, ఫ్రెంచి వారికే పరిమితమయింది. స్థానిక ప్రభుత్వాలకు సముద్రం మీదనే కాక, భూమి మీద కూడా అధిపత్యం లేకుండా పోయింది. కర్ణాటక ప్రదేశమంతటా రాజకీయ అవ్యవస్థ ఏర్పడింది. కర్ణాటక ప్రాంతం దక్కను సుబేదారు కింద ఒక పరగణాగా ఉండేది, దాన్ని ఆర్కాటు నవాబు గవర్నరుగా ఏలుతూండేవాడు. అయితే దక్కను సుబేదారైన నిజాముల్‌ముల్క్ స్వతంత్రుడుగా వ్యవహరించినట్టే, ఆర్కాటు నవాబు కూడా స్వతంత్రరాజులాగా వ్యవహరించసాగాడు. ఉత్తర దేశపు రాజకీయాలలోనూ, మహా



రాష్ట్రులతోనూ మునిగి తేలుతున్న నిజాము కర్ణాటక వ్యవహారాలపైన తన దృష్టి కేంద్రీకరించ లేకపోయాడు.

అయితే 1743 లో ఆయన దృష్టి కర్ణాటకం కేసి తిరిగింది. అంతకు మూడేళ్ళ క్రితం మహారాష్ట్రులు కర్ణాటకం పైన పడి దోచుకుని, గవర్నరును చంపి, అతని అల్లుణ్ణి, చందా సాహెబ్ అనేవాణ్ణి ఖైదీగా సాతారాకు పట్టుకుపోయారు. గవర్నరు కొడుకు మహారాష్ట్రులకు ఒక కోటి రూపాయలిచ్చి తన ప్రాణాన్నీ, రాజ్యాన్నీ కాపాడుకో జూశాడు, కాని అతన్ని అతని దాయాది ఒకడు హత్య చేశాడు. ఇలాటి సంఘటనలతో కర్ణాటక ప్రాంత ప్రజలు ఆందోళన పడి పోయారు. అందుకని నిజాము స్వయంగా కర్ణాటకానికి వెళ్ళి, అన్వారుద్దీన్ ఖాన్ అనేవాణ్ణి కర్ణాటక నవాబుగా నియమించి పరిస్థితి చక్కబరచ యత్నించాడు. కాని ఈ ప్రయత్నం కొనసాగలేదు. జాగీర్లు అనుభవిస్తున్న పాత నవాబు బంధుగణం కొత్త నవాబు రాకను సహించలేదు.

ఈ విధంగా కర్ణాటకంలో చెలరేగిన అశాంతి ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారాలను ఏ విధంగానూ బాధించలేదు. అప్పట్లో వారు కూడా, తమ వ్యాపారానికి తభావతు వస్తే తప్ప, భారత రాజకీయాల చాయలకు రాలేదు. ఇలాగే జరిగిపోయినట్టయితే ఏమయేదో చెప్పలేం. కాని, 1740-48 మధ్య యూరపులో జరిగిన అస్త్రియా రాజవారసత్వపు యుద్ధంలో ఇంగ్లండు చిక్కుకున్నది. ఫ్రాన్సు కూడా చిక్కుకున్నది. అయితే రెండుదేశాలూ వ్యతిరేక పక్షాలవలంబించాయి. ఈ వైరం ఆ దేశాల వర్తకాలకు కూడా సంక్రమించింది. ఇలా జరగకుండా, ఇండియా పొలిమేరలో ఉభయదేశాలకూ శాంతి ఉండేటట్టు చెయ్యాలని పుదుచ్చేరి గవర్నరు డూప్లే చేసిన సూచన అమలు జరగలేదు.



# నేహ్రూ కథ

## 35



జవాహరు ప్రతిష్ఠ ఎంతదాకా పోయిందంటే, బ్రిటనులో ఎన్నికలు జరిగితే అతన్ని విడుదల చెయ్యటం ఎన్నికల పోటీకి ఒక అంశమయింది. ఆ స్థితిలో లార్డు వావెల్ ఒక ప్రణాళిక (వావెల్ ప్లాన్) తయారు చేసి, దాని ఆధారం మీద కాంగ్రెసు వర్కింగు కమిటీని—1945 జూను 15 న—జైళ్ళ నుంచి విడుదల చేయించాడు.

జవాహరు జూను 18 న అలహాబాదులో ఉపన్యసిస్తూ, "కాంగ్రెసు చితకాలేదు, చావాలేదు," అన్నాడు.

వావెల్ ప్లాను ప్రకారం సమ సంఖ్యగల హిందూ, ముస్లిము సభ్యులతో ఒక కౌన్సిలు ఏర్పాటు చేసి, అమలులో ఉన్న రాజ్యాంగం కిందనే ఆ కౌన్సిలు ద్వారా పరిపాలన సాగిస్తారు. వైస్రాయి, కమాండరిన్‌చీఫ్‌ల అధికారా లెప్పటిలాగే ఉంటాయి.

విడుదల అయిన జవాహరుకు అంతటా ప్రజలు ఘనమైన స్వాగతం తెలిపారు.

తాను జైలులో ఉన్న సమయంలో జరిగిన 1942 అగస్టు విప్లవాన్ని జవాహరు సమర్థించలేదు గాని, అందులో ఆహుతి అయిన వారి ధైర్యాన్ని అతను ప్రశంసించాడు. 1943 లో సాగిన కలకత్తా ఆకలి చావుల వెనక ఉన్న ధాన్యపు దొంగలను అతను తీవ్రంగా నిరసించాడు.

వావెల్ ప్లాను గురించి చర్చించటానికి కాంగ్రెసు అధ్యక్షుడు అజాద్ జవాహరును సిమ్లాకు రమ్మన్నాడు. అయితే సిమ్లా సమావేశం పూర్తిగా విఫలమయింది. జిన్నా దాన్ని భగ్నం చేసేశాడు. జవాహరు అటే నిరుత్సాహపడలేదు. వావెల్ పథకం అమలు జరుగుతుందని అతను ఆశ పెట్టుకోలేదు.

1945 సెప్టెంబరులో కాంగ్రెసు కమిటీ "క్విట్ ఇండియా" తీర్మానాన్ని పునరుద్ధా





1945 నవంబరు 11 న జవాహరు బొంబాయిలో ఒక బ్రహ్మాండమైన మీటింగులో ఉపన్యసించాడు. "ఢిల్లీచలో" అన్న పాటతో అది ప్రారంభమయింది.

"అనేక రాష్ట్రాలలో కాంగ్రెసు గెలిచి తీరుతుంది. ఎనిమిది తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వా లేర్పడవచ్చు. ఢిల్లీలోని కేంద్రప్రభుత్వం మన అధీనంలోకి రావాలి. దేశం స్వతంత్రం కావాలి. దేశ స్వాతంత్ర్యమే మన ముఖ్యలక్ష్యం," అన్నాడు జవాహరు.

భారత స్వాతంత్ర్యానికి గల అవాంతరా లేవో, వాటిని ఎలా తొలగించవచ్చునో తెలుసుకు రావటానికి ఒక బ్రిటిషు పార్లమెంటు ప్రతినిధివర్గం 1945 డిసెంబరులో ఇండియాకు వచ్చింది. ఇదే బ్రిటిష్ కాబినెట్ మిషన్. ఇందులో 8 మంది ఉన్నారు. వీరు అన్ని పార్టీల నాయకులనూ కలుసుకుని, భారతరాజ్యాంగాన్ని భారతీయులే నిర్ణయించుకొనటానికి వెంటనే ఏర్పాట్లు ప్రారంభించవచ్చుననీ, రాజ్యాంగం తయారయే దాకా పరిపాలనను కొనసాగించటానికి మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు చేయవచ్చుననీ అన్నారు.

మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటుకు సూచనలను చెయ్యవలసిందిగా వైస్రాయి

టించింది. కాంగ్రెసుకు కావలిసినది సంపూర్ణ స్వాతంత్ర్యం; అది సంప్రతింపుల ద్వారా లభించకపోతే ప్రత్యక్ష చర్య జరిగి తీరుతుంది.

భారతదేశానికి స్వాతంత్ర్యం రాక పూర్వమే ఎన్నికలు వచ్చాయి. బ్రిటనులో ఏర్పడిన లేబరు ప్రభుత్వం తమకు కాస్త గుక్కతిరగటం కోసం 1945 ఆఖరులో ఈ ఎన్నికలు ఏర్పాటు చేసింది. ఇందువల్ల దేశంలోని ధోరణి స్పష్టమవుతుందని వారి ఉద్దేశం. ఎన్నికల ద్వారా స్వాతంత్ర్యం రాబోదని తెలిసి కూడా కాంగ్రెసు వాటిలో ఉత్సాహంతో పాల్గొన్నది.



కాంగ్రెసును ఆహ్వానించాడు. కాంగ్రెసు తరఫున ఆ ఆహ్వానాన్ని జవాహరు స్వీక రించి, జిన్నాను సహకరించ వలసిందిగా కోరాడు. కాని జిన్నా తన సహకారాన్ని నిరాకరించాడు.

జవాహరు మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు చేశాడు. ఇందులో అతని వెంట అయిదుగురు కాంగ్రెసు అగ్రనాయకు లున్నారు: సర్దారు పటేలూ, డా. రాజేంద్ర ప్రసాదూ, సి. రాజగోపాలాచారీ, శరత్‌చంద్ర బోసూ, అసఫ్ అలీ. ఈ ప్రభుత్వం ఏర్పడి నట్టు **1946** ఆగస్టు **24**న వైస్రాయి ప్రక టించాడు. ఈ ప్రభుత్వం ఏర్పాటయిన ఆరు రోజులకు జవాహర్ రేడియోలో ప్రసం గిస్తూ, "ఈ ప్రభుత్వం సంపూర్ణ స్వాతం త్ర్యానికి ఒక మెట్టు. మన లక్ష్యం ప్రజలు అనుకునేటంత సమీపంలో లేకపోవచ్చు. ఆత్మసంతృప్తి అత్యంత అపాయకరం." అని ప్రజలను హెచ్చరించాడు.

సెప్టెంబరు 2 నుంచీ ఈ మధ్యంతర ప్రభుత్వం పని చేయవలసి ఉన్నది. ఆనాడే జిన్నా తన వ్యతిరేకోద్యమాన్ని ప్రారంభించాడు. సింధు, బెంగాలు రాష్ట్రాలలోని ముస్లిములీగు ప్రభుత్వాలు ఆ రోజు శలవు ప్రకటించాయి. సింధు



రాష్ట్రం శాంతంగానే ఉండి పోయింది గాని, కలకత్తాలో మతకలహాలు చెలరేగి దారుణ మైన హత్యాకాండ జరిగింది. కలకత్తాలో మత రాక్షసి సద్దుమణుగుతూనే నవఖాలీ లోనూ, ఆ వెంబడే బొంబాయి, అహమ్మదా బాదులలోనూ అల్లర్లు సాగాయి. కాంగ్రెసు పాలితమైన బిహారు కూడా పగ తీర్చుకొన పూనింది.

"భారతదేశం స్వతంత్రం కావాలంటే ఇంతకంటె హెచ్చు మత సహనం అవ సరం," అన్నాడు వైస్రాయి.

"అందరికీ సమానావకాశాలుగల వ్యవస్థ ఏర్పడనుండగా, ఈ భయాలూ, అనుమా

నాలూ, సంఘర్షణా దేనికి?" అని జవాహరు దేశాన్ని ప్రశ్నించాడు.

వైస్రాయి ముస్లిములీగును దువ్వ సాగాడు. ఆ సంస్థ కూడా మధ్యంతర ప్రభుత్వంలో చేరాలని సలహా ఇవ్వటానికి, ఆయన జులై 29 న జిన్నాను ఢిల్లీకి ఆహ్వానించాడు. జిన్నా, జవాహర్ల మధ్య సంప్రతింపులు జరిగాయి. వా రిద్దరి మధ్యా సామరస్యం కుదరకపోయినా, వైస్రాయి బోధలు తల కెక్కి జిన్నా ముస్లిములీగును మధ్యంతర ప్రభుత్వంలో ప్రవేశపెట్టాడు. ఉభయ పక్షాల నాయకులతో ప్రభుత్వం ఏర్పాటు అయింది. అందులో ఆరుగురు కాంగ్రెసు మంత్రులూ, ఆరుగురు ముస్లిములీగు మంత్రులూ ఉన్నారు.

ఈ ప్రభుత్వంలో ముస్లిములీగు చేరటానికి జవాహరు రెండు నియమాలు పెట్టాడు: 1. రాజ్యాంగ సభలో పాల్గొనటం, 2. సమిష్టి బాధ్యత. కాని ముస్లిములీగు రాజ్యాంగ సభలో చేర నిరాకరించింది. రెండవ నియమాన్ని కూడా అది వీలున్న మేరకు ఉల్లంఘిస్తూ, ప్రభుత్వాన్ని భగ్నపరచటానికీ, వైస్రాయికి అనుకూలంగానూ ప్రవర్తించింది. కాబినెట్‌లోని కాంగ్రెసు మంత్రులకూ, లీగు మంత్రులకూ సమన్వయం లేక పోయింది.

జవాహరు ఇరుకున పడ్డాడు. అతను రాజీనామా ఇచ్చేద్దామనుకున్నాడు, కాని ఇవ్వలేదు. మతకలహాలమూలాన పంజాబులోని రావల్పిండి, లాహోరు, అమృతసర్, ముల్తాన్ నగరాలలో దారుణ హత్యలు సాగాయి. 1947 మార్చిలో కాంగ్రెసు కమిటీ సమావేశమై, పంజాబు పరిస్థితి గురించి చర్చించి, పంజాబును రెండుగా విభజించి, ముస్లిములు అధికంగా ఉండే భాగాన్నీ, హిందువులు అధికంగా ఉండే భాగాన్నీ వేరు వేరు చెయ్యటం పరిష్కారమార్గమని భావించింది.





# పాతాళదుర్గం

## 13

[పొట్టిరాక్షసుడు పడవను నదివాలు కేసి నడిపాడు. భిల్లులు దాని మీద రాళ్ళు విసరసాగారు. పడవ నదిలో వున్న గండశిల కొక దానికి తగిలి బద్దలైపోయింది. పొట్టి రాక్షసుడు ఒక స్త్రీతో సహా ఒడ్డుకు చేరాడు. ధూమకుడూ వాళ్ళు కూడా ఒడ్డు చేరేంతలో, శిథిలదేవాలయం నుంచి ఒక పెద్ద నరవానరం వాళ్ళ పైకి రాసాగింది. తరవాత—]

ధూమకుడు అందరికన్న ముందున్నాడు. అతడు తమ పైకి వస్తున్న నరవానరం కేసీ, దాని వెనక చెట్లమీద వున్న యితర మృగాలకేసీ ఓమారు చూశాడు. చెట్టు కొమ్మల్లో వున్న చిన్నాపెద్ద నరవానరాలూ, ఎలుగుబంట్లూ—అన్నీ కళ్ళప్పగించి తమ వైపే చూస్తున్నట్టు అతడు గ్రహించాడు.

"విరూపా! ఇది వింతగా లేదా? మనిషంటే ఎంతటి క్రూరమృగమైనా భయపడి పారిపోతుంది. కాని, వీటి ప్రవర్తన అందుకు భిన్నంగా వుంది. బహుశా, యీ మృగాలు యీనాటివరకూ మానవమాత్రుణ్ణి చూసి వుండవేమో," అన్నాడు ధూమకుడు.

విరూపుడు, ధూమకుడి మాటలేవీ ఆలకించటం లేదు. అతడు తన భుజం మీద వున్న నల్ల గరుడపక్షిని దువ్వుతూ; ఒక్కొక్క అడుగే ముందుకేస్తూ, వికృతంగా అరుస్తున్న నరవానరం కేసి చూడసాగాడు. సోమకుడు






బాణం ఎక్కుపెట్టి, ధూమకుడి ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నాడు. పులిందుడు యివేమీ గమనించటం లేదు, అతడి దృష్టి నదికి కొంచెం దిగువగా ఒడ్డు చేరిన పొట్టిరాక్షసుడి పైనా, అతడి పక్కనే నీటి ఒడ్డున సొమ్మ సిల్లి పడివున్న స్త్రీమీదా వున్నది. ఇక, తెప్ప లను నడిపిన నలుగురు భిల్లులూ భయంతో వణికిపోతూ, తమ నాయకుడు ఊఁ అంటే నదిలో వున్న తెప్పల మీదికి పారిపోయేం దుకు సిద్ధంగా వున్నారు.

ధూమకుడు నిర్భయంగా నిలబడి నర వానరాని కేసి ఈటె గురిచేసి, సోమకుణ్ణి బాణం వదల వద్దని వారిస్తూ, "ఈ వానరం ఆ చెట్ల మీద వున్న మృగాలకన్నిటికీ నాయ కుడులా వున్నది. దీన్ని చంపామో, అవన్నీ మన మీద వచ్చి పడొచ్చు. దీన్ని భయపెట్టి తరుముదాం. శిథిలాలయంలో మరెన్ని మృగాలున్నవో తెలియదు," అన్నాడు.

ఇంతలో పులిందుడు ఒక పెద్ద గావుకేక పెట్టి, తెప్పల కేసి పరిగెత్తుతూ, "ఆ పొట్టి రాక్షసపు వెధవ నా పెళ్ళాన్ని తీసుకుని అరణ్యంలోకి పారిపోబోతున్నాడు. ఇక్కడ మనకేం పని? ముందు ఆ దుర్మార్గుణ్ణి పట్టుకుని, నా పెళ్ళాన్ని వాడి చెర నుంచి విడిపించాలి," అన్నాడు.

భిల్లనాయకుడైన పులిందుడి మాటలు ధూమకుడికి సబబుగానే కనిపించినై. తాము పొట్టిరాక్షసుణ్ణి పట్టుకుంటే, అతడి ద్వారా మహాకలిని గురించిన ఎన్నో రహస్యాలు తెలుసుకోవచ్చు. రాజకుమార్తె కాంతిసేనను వెతికి తెచ్చే బాధ్యత మీద వేసుకున్నది తనూ, సోమకుడూ. ఆ ప్రయత్నంలో పులిందుడూ, విరూపుడూ తమకు సాయం చేయాలంటే, పులిందుడికి అతడి పడుచు భార్యను తిరిగి సంపాదించేందుకూ, విరూ పుడికి మాంత్రికుడైన కాలశంబరుడి యోగక్షేమాలు తెలుసుకునేందుకూ తాము తోడ్పడక తప్పదు...



"పులిందా, ఆగు! మేమూ వస్తున్నాం. అనవసరంగా యీ అడవి మృగాలతో గిల్లికజ్జాలు పెట్టుకోవటం ఎందుకు? తెప్పల మీద పోయి, ఆ రాక్షసుడున్న చోటనే తీరం చేరుదాం. వాడు, యీలోపల అరణ్యంలోకి ఎంతో దూరం పారిపోలేడు," అన్నాడు ధూమకుడు.

ఆ వెంటనే అందరూ తెప్పల కేసి బయలుదేరారు. ధూమకుడూ, సోమకుడూ మాత్రం నరవానరానికి వెన్ను చూపక, జాగ్రత్తగా వెనక్కు నడవసాగారు. కాని, వాళ్ళావిధంగా తెప్పల కేసి పోవటం చూస్తూనే, నరవానరం రొమ్ము చరుచుకుని భయంకరంగా అరిచి కుప్పిగంతేసి ముందుకు దూకింది. చెట్ల మీద వున్న మృగాలన్నీ బిలబిల మంటూ కొమ్మల మీంచి కిందికి దూకి ధూమకుడూ వాళ్ళ కేసి పరిగెత్తుకు రాసాగినై.

ఇది చాలా ప్రమాదకరమైన పరిస్థితి. వెన్నిచ్చి పరిగెత్తటం ప్రారంభిస్తే, తాము తెప్పలను చేరకముందే నరవానరాలూ, ఎలుగుబంట్లూ తమ మీదికి వచ్చి పడతై. అలాకాదని నిలబడి దెబ్బతీయాలని చూసినా, యిన్ని క్రూరమృగాలను ఎదిరించి జయించటం సాధ్యమయే పనికాదు...



ధూమకు డిలా ఆలోచిస్తూ, పక్కకు తిరిగి సోమకుడితో ఏదో చెప్పబోయేంతలో, వెనక్కు అడుగులేస్తున్న సోమకుడు కాలు జారి ముందుకు తూలాడు. అది చూస్తూనే నరవానరం అతడి కేసి దూకబోయింది. కాని, యింతలో విరూపుడు పెద్దగా, "అహ్హా, శాంభవీ!" అంటూ బొబ్బరించి, "కాల గరుడా! నీ కాలిబలం, ముక్కు వాడీ చూపించు! అందుకు యిదే మంచి తరుణం," అంటూ భుజం మీద వున్న నల్ల గరుడపక్షిని, నరవానరం కేసి విసిరాడు.

గరుడపక్షి రెక్కలు చాచి లేస్తూనే మెరుపులా పోయి నరవానరం తల మీద





బలంగా ఒక్క తన్ను తన్నింది. వానరం ఆ తన్నుకు వెల్లికిలాపడి అరుస్తూ లేచి, గరుడపక్షి కేసి చేతులు చాచబోయేంతలో, పక్షి అంత ఎత్తునుంచి రెక్కలు టపటప లాడిస్తూ వచ్చి, వానరం మెడమీద గట్టిగా ఒక దెబ్బ కొట్టింది.

ఆ దెబ్బకు నరవానరం ఎగిరి అల్లంత దూరానవున్న రాళ్ళమీద పడి, పల్లానికి దొర్లుకుపోయింది.

తమ నాయకుడు మట్టికరవటం చూస్తూనే, తతిమ్మా మృగాలు ఎక్కడి వక్కడ నిలిచిపోయాయి. అదే అదనుగా ధూమకుడూ అతడి అనుచరులూ పరిగెత్తు కుంటూ పోయి తెప్పలను చేరారు. అందరి కన్న వెనకగా తెప్ప ఎక్కినవాడు, విరూ పుడు. అతడు, ఈలలు కొడుతూ, చిటికెలు వేస్తూ, నల్ల గరుడపక్షిని తిరిగి పట్టుకునేం దుకు ప్రయత్నిస్తున్నాడు. కాని, గరుడపక్షి ఎగురుతూపోయి, శిథిల దేవాలయం మీద కొద్దిసేపు కూర్చుని, కీ అని అరుస్తూ లేచి, గాయపడిన నరవానరం చుట్టూ చేరిన మృగాల తలల మీదుగా రివ్వు రివ్వుమని ఎగరసాగింది.

"విరూపా! ఆ పక్షి యిక నీదికాదు, దాని సంగతి మరిచిపో. అది మనకు చేయ గల సహాయం ఏదో చేసింది. మనం తీరం వెంట పోయి, ఆ పొట్టి రాక్షసుణ్ణి చేజిక్కించు కోవాలి," అన్నాడు ధూమకుడు.

విరూపుడు యింకా ఆశగా గరుడపక్షి కేసే చూస్తున్నాడు. దాని కాలి నుంచి అతడు కట్టిన తాడు కిందికి జీరాడుతూనే వున్నది. "అది, నా పెంపుడు పక్షి. నన్ను వదిలిపోదు, చూస్తూండండి...నా చిన్న బాబువుకదూ, కాలగరుడా, యిటురా!" అంటూ విరూపుడు చప్పట్లు చరిచి కేకలు వేయసాగాడు.

తెప్పలు రెండూ ముందుకు కదిలినై. పులిందుడు తన అనుచరులను త్వరగా






తెడ్లు వేయమని తొందరపెడుతున్నాడు. తాము సమీపించే లోపలే పొట్టిరాక్షసుడు, తన పడుచు పెళ్ళాన్ని ఎత్తుకుని అరణ్యంలోకి పారిపోతాడని పులిందుడికి చెడ్డ భయంగా వున్నది.

కాని, పొట్టిరాక్షసుడు పారిపోయే ప్రయత్నం ఏమీ చేయకపోగా, తన వెంట వున్న స్త్రీ భుజాల మీద చేయివేసి చిరునవ్వు నవ్వుతున్నాడు. అంతేకాక తానున్న ప్రదేశాన్ని సమీపిస్తున్న తెప్పలను ఆవిడకు చూపిస్తూ, వేలితో పులిందుణ్ణి ప్రత్యేకంగా గుచ్చెత్తి చూపి ఏదో అడిగాడు. స్త్రీ ఏమో చెప్పి నవ్వింది. పొట్టిరాక్షసుడు పొట్ట చెక్కలయేలా నవ్వుతూ తీరం వెంట కొంత దూరం ముందుకు పరిగెత్తుకుంటూ వచ్చి, "మీరు వస్తున్నది నన్ను పట్టుకోవటానికా, నా పెళ్ళాన్ని పట్టుకోవటానికా?" అని కేక వేసి అడిగాడు.

తెప్పల్లోవున్న అందరి దృష్టీ, పులిందుడి కేసి మళ్ళింది. పులిందుడు ఒక్క రంకె వేసి రాక్షసుడి మీద కలియబడేందుకు నీళ్ళల్లో దూకి ఒడ్డుకు ఈదుకుపోతాడని వాళ్ళు భావించారు. కాని, పులిందుడిలో ఎలాంటి చలనమూ లేదు. అతడు గుడ్లప్పగించి నది ఒడ్డునున్న స్త్రీకేసి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"అది నా పడుచు పదోపెళ్ళాం కాదు. నా పెళ్ళాం పడవ మునిగినప్పుడు నదిలో పడి చచ్చిపోయయినా వుంటుంది, లేదా ఆ బుడంకాయ రాక్షసుడు దాని మీద మంత్ర ప్రయోగం చేసి రూపయినా మార్చి వుంటాడు. నా శ్రమ అంతా వృథా అయింది," అన్నాడు పులిందుడు, ఎక్కడ లేని నిరాశా నిస్పృహలు కనబరుస్తూ.

తెప్పలు రాక్షసుడున్న చోటు చేరగానే, ధూమకుడు అందరికన్న ముందు ఒడ్డుకు దూకాడు. రాక్షసుడు స్త్రీతోపాటు ఒడ్డు నుంచి ఒక ఇరవై అడుగుల దూరం



వెనక్కుపోయి నిలబడి, "మీతో నాకు శత్రుత్వం ఏమీలేదు. ఈ ఆడది మీలో ఎవరి పెళ్ళామూ కాదు. దీని కోసమేగదా మీరింత దూరం నా వెంటబడి వచ్చింది? ఇక మీదారిన మీరుపొండి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

ఆ మాటలకు ధూమకుడు నవ్వి, "మా మనుషుల్లో ఒక సామెతవుంది; పొట్టివాడికి పుట్టెడు జిత్తులని! నువ్వు రాక్షసుల్లో వామనుడివి, నీ దగ్గిర పది పుట్ల జిత్తులుండవచ్చు. మాకూ నీతో ఎలాంటి శత్రుత్వమూ లేదు. మాకు కావలసిందల్లా, మహాకలిరాక్షసు డుండే పాతాళదుర్గానికి దారి. ఆ దారిమార్గం ఎక్కడో మాకు చెప్పి, నీ దారిన నువ్వుపో, మా దారిన మేముపోతాం," అన్నాడు.

"పాతాళదుర్గానికి వెళ్ళినవా రెవరూ ప్రాణాలతో బయట పడలేరు. అంత కావా లనుకుంటే, ఆ దారి తెలుసుకుని కాళ్ళరి గేట్టు నడవటం ఎందుకు? ఒకటీ రెండు నెలలపాటు యీ ప్రాంతాలే తిరుగుతూం డండి. ఆ మహాకలి రాక్షసుడి బంట్లు వచ్చి మిమ్మల్ని కాళ్ళూ చేతులూ కట్టి, వాడి పాతాళదుర్గానికి మోసుకు పోతారు," అన్నాడు పొట్టిరాక్షసుడు.




"అలా కాదు. ఆ దుర్మార్గుడికి తెలియ కుండా వాడి దుర్గంలో ప్రవేశించి, ఒకానొక రాజకుమార్తెను రక్షించి తేవలసి ఉన్నది," అన్నాడు ధూమకుడు.

"నా పడుచుపెళ్ళాం, భామాసింగి కూడా వాడి చెరలోనే ఉన్నది, అనుమానం లేదు. వాడి నౌకర్లే గదా దాన్ని అరణ్యంలో నుంచి ఎత్తుకుపోయింది? ఆ మహాకలి రాక్షసుడి పీక నరికి, వాడి నెత్తురుతో దాహం తీర్చుకుంటాను," అన్నాడు పులిందుడు జబ్బలు చరుచుకుంటూ.

పొట్టిరాక్షసుడు మారు మాటాడకుండా, ధూమకుడూ వాళ్ళ దగ్గిరకు వచ్చి, "నేను



యివ్వవలసిన హెచ్చరికేదో యిచ్చాను, తర వాత మీ యిష్టం. పాతాళదుర్గానికి వెళ్ళేం దుకు దగ్గిర మార్గమేదో మీకు చెపుతాను, అందరూ నా వెంట రండి," అంటూ వాళ్ళను వెంట బెట్టుకుని శిథిలదేవాలయాని కేసి బయలుదేరాడు.

దేవాలయం యింకా కొంచెం దూరంలో వున్నదనగా ధూమకుడు ఆగి, "మనం వెళుతున్నది ఆ దేవాలయ ఆవరణలోకా? అక్కడున్న క్రూరమృగాల మాటేమిటి? ఇంతకు ముందే వాటివల్ల పెద్ద ప్రమాదంలో పడ్డాం," అన్నాడు.

"మీకు సంగతి తెలియక వాటిని రెచ్చ గొట్టారు. అవన్నీ రాక్షసబంట్ల పెంపుడు జంతువులు. ఇన్ని అడవికాయలూ, దుంపలూ వాటి కేసి గిరవాటు వేస్తే, అవి పిల్లుల కన్నా సాధుజంతువులై పోతాయి," అంటూ పొట్టిరాక్షసుడు, దాపుల నున్న చెట్ల నుంచి యిన్ని కాయలు కోశాడు. అతడితోపాటు ధూమకుడూ వాళ్ళు కూడా కాయలు కోసి తీసుకుని, శిథిలదేవాలయాన్ని సమీపిస్తూనే, వాటిని అడవిమృగాల మీదికి విసిరివేశారు.

పొట్టిరాక్షసుడు అందరినీ ఆలయంలోకి తీసుకుపోయి, చీకటిగా వున్న కొన్ని గదుల కుండా వాళ్ళను నడిపి, చివరకు బీటలు వారి నేలకూలడానికి సిద్ధంగా వున్న ఒక గోడ మీదికి ఎక్కించి, దిగువ నున్న ఒక కందకాన్ని చూపిస్తూ, "పాతాళదుర్గానికి పోవాలంటే ఒకేఒక మార్గం వున్నది, అదే ఇది!" అన్నాడు.

ధూమకుడూ, అతడి అనుచరులూ తలలు వంచి కందకంలోకి చూశారు. అందులో మొసళ్ళూ, పెద్ద పెద్ద సర్పాలూ వున్నవి. అవి ఒకదాని మీద ఒకటి కలియ బడి కుస్తీపట్లు పట్టుతున్నవల్లా, గోడ మీద మనుషులు కనబడగానే, నోళ్ళు తెరిచి పైకి చూడసాగినై. —(ఇంకావుంది)






# ఒప్పందం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి పోయి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, అసాధారణమైన నీ శ్రమ ఎందుకు ఫలించటం లేదో నాకు తెలియకుండా ఉన్నది. సమీరుడి లాగే నువు కూడా నీకే తెలియకుండా ఏదో నియమాన్ని ఉల్లంఘించి ఉంటావని అనుమానం కలుగుతున్నది. శ్రమ తెలియకుండా నీకు సమీరుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

గంధమాదన పర్వత సమీపంలో ఒక క్షత్రియకుటుంబం ఉండేది. వారికి భూవసతి కొంత ఉన్నప్పటికీ, వ్యవసాయం వారి వృత్తికాదు. తండ్రికొడుకులందరూ క్షత్రియ ధర్మాన్ని అవలంబించి అస్తమానమూ యుద్ధాలను వెతుక్కుంటూ వెళ్ళేవారు.

## బేతాళ కథలు




దాని ఫలితంగా తండ్రీ, ముగ్గురు కొడుకులూ ఒకే యుద్ధంలో ఏక కాలమందే ప్రాణాలు వదిలారు. కుటుంబంలో మిగిలినవారు తల్లీ, ఆఖరు కొడుకు సమీరుడూ మాత్రమే. సమీరుడైనా మరీ పసివాడు కావటాన చావ కుండా మిగిలాడు.

ఈ విధంగా తన భర్తా, చెట్టంత కొడు కులూ ఒక్కసారిగా చచ్చేసరికి సమీరుడి తల్లి, తమ కుటుంబాని కింక క్షత్రియ ధర్మం చాలుననుకున్నది. ఆమె సమీరుణ్ణి వ్యయ సాయ వృత్తిలో ప్రవేశించి, గొడ్డూ గోదా చూసుకోమన్నది. సమీరుడా పనులు చక్కగా నేర్చుకున్నాడు. అతని పొలాలు చక్కగా పండాయి, అతని పశువుల మందలు చక్కగా పెరిగాయి. పొలం పనీ, గొడ్ల పనీ కూడా అతనే చూసుకునేవాడు.

చూస్తుండగానే సమీరుడు ఇరవై ఏళ్ళ వాడయాడు.

"నా కొడుకు అందగాడు. వాడికి తగిన పెళ్ళాం దొరకాలి. బ్రహ్మరాత ఎలా ఉన్నదో?" అనుకునేది తల్లి. ఆ చుట్టు పక్కల ఎక్కడా అతనికి ఈడయిన పిల్లా, అనురూప అయిన పిల్లా ఉన్నట్టు ఆమెకు తెలియరాలేదు.

ఒకనాడు సమీరుడు తనంత తానే, "అమ్మా, నేను పెళ్ళి చేసుకోవద్దా?" అని తల్లిని అడిగాడు.

"చేసుకోవాలిరా, బాబూ. కాని పిల్ల ఎక్కడైనా ఉందా?" అని తల్లి అడిగింది.

"అదే నాకూ తెలియలేదు," అన్నాడు సమీరుడు.

ఈ సంభాషణ జరిగిన కొద్ది రోజులకే సమీరుడు తన ఆవులను కొండ మీద ఉండే సరస్సు దగ్గిరికి మేతకు తోలుకుపోయాడు. అది చాలా అందమైన చోటు. ఆవులు మేస్తూంటే సమీరుడు సరస్సు ఒడ్డున ఉన్న చెట్టు నానుకుని, సరస్సు మీది నుంచి వచ్చే చల్లని గాలికి కాస్త కన్నుమూశాడు.

నిద్రా మెలకువా కాని స్థితిలో అతనికి ఎవరో స్త్రీ మాట్లాడిన మాట లిలా విని పించాయి:

"నిద్ర మాయ,
కల అబద్ధం,
కళ్ళుతెరిచి
కన్యను చూడు."

సమీరుడు ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసి, కలగంటున్నాననుకున్నాడు. అతనికి అయిదారు బారల దూరాన, నీటి పైన కాళ్ళు ముడుచుకుని కూర్చుని ఒక అపూర్వ సౌంద ర్యవతి, చీకటి దుబ్బులాగున్న జుట్టును బంగారు దువ్వెనతో దువ్వుకుంటున్నది.

అతని నోట మాట రాలేదు. ఆమెను చూస్తున్న ఆనందంతోబాటు ఆమె ఏ క్షణాన అంతర్ధాన మవుతుందోనన్న భయం కూడా అతన్ని బాధించింది. కొంచెం సేపు గడిచాక అతను తన తల్లి కట్టి ఇచ్చిన రొట్టెను తీసు కుని నీటి ఒడ్డు దాకా వెళ్ళి, ఆమెను తీసుకోమన్నటుగా ఆ రొట్టెను ఆమె కేసి చాచాడు.

"మాడిన రొట్టె,
కూడని మొగుడు,"

అని పకపకా నవ్వి ఆమె బుడుంగున నీటిలోకి మునిగిపోయింది.



ఆమెతోబాటే సమీరుడికి మతి కూడా పోయినట్టయింది. అతను మంత్రించి నట్టుగా ఆమె మునిగిన చోటే చూస్తూ గంటల తరబడి అలాగే ఉండి పోయాడు. ఇంతలో ఆవులు అరవసాగాయి. అవి ఇళ్ళకు వెళ్ళే వేళ అయింది. సమీరుడు పరధ్యానంగా కదిలి, ఆవులను ఇంటికి తోలుకుపోయాడు.

"అలా ఉన్నా వేం రా, బాబూ?" అన్నది తల్లి, సమీరుణ్ణి చూస్తూనే. ఆమెకు అతనిలో అంత మార్పు కనబడింది.

కొండ మీది సరస్సు వద్ద జరిగినదంతా సమీరుడు తల్లికి చెప్పాడు.



"తప్పంతా నాదేరా. ఏదో పని మీద ఉండి, రొట్టెను మాడనిచ్చాను. రేపు చూడు, ఎంత మెత్తగా చేస్తానో," అన్నది తల్లి.

మర్నాడు తల్లి అతి శ్రద్ధగా చేసి ఇచ్చిన రొట్టె తీసుకుని సమీరుడు తన ఆవులను మళ్ళీ ఆ సరస్సు దగ్గిరికే తోలుకు వెళ్ళాడు. ఈ రోజు కూడా కిందటి రోజులాగే, చల్ల గాలికి అతని కళ్ళు బరువెక్కి మూతపడి పోతూండగా ఆమె కంఠం వినిపించింది. అతను మళ్ళీ రొట్టె చేతపట్టుకుని నీటిఒడ్డుకు వెళ్ళి ఆమె కేసి రొట్టె చాచాడు:

"కాలని రొట్టె,
చాలని మొగుడు,"

అంటూ ఆమె మళ్ళీ ఖుడుంగన నీటిలో మునిగి, మళ్ళీ సాయంకాలం దాకా కని పించనే లేదు.

సమీరు డింటికి వచ్చి, "నిన్న రొట్టె మాడ్చావు. ఇవాళ పచ్చిపచ్చిగా ఇచ్చావు," అని తల్లిని ఆక్షేపించాడు.

"ఈ సారి చూడరా, బాబూ," అంటూ తల్లి మూడోసారి అతనికి అద్భుతంగా రొట్టె తయారు చేసి ఇచ్చింది.

సమీరుడు, ఈ రోజు నీటి మీద ఆమె కనిపించగానే, "అమ్మాయీ, ఈ రొట్టె తీసుకుని నన్ను పెళ్ళాడతావా? నిన్ను పువ్వులలో పెట్టి పూజిస్తాను. నువు నాకు భార్యవైతే నా అంత అదృష్టవంతుడు ప్రపం చంలో ఉండడు," అన్నాడు.

"కమ్మని రొట్టె,
ఘనమైన మొగుడు,"

అంటూ ఆమె నీటి మీద తేలి ఒడ్డుకు వచ్చి, అతని చెయ్యి ఆధారంతో ఒడ్డుకెక్కి, "నేను నిన్ను పెళ్ళాడతాను, కాని ఒక్క నియమం. నువు నన్ను మూడుసార్లు అకారణంగా దెబ్బ వేశాక ఇక నేను నీతో కాపరం చెయ్యను. అది నీకు సమ్మతమైతే చెప్పు. లేకపోతే నేనిప్పుడే మా ఇంటికి తిరిగి వెళ్ళి పోతాను," అన్నది.



సమీరుడు నిర్ఘాంతపోయి, "నేను నిన్ను ఒక్కసారి మటుకు అకారణంగా ఎందుకు కొడతాను? అది అనుకోటానికే అసహ్యంగా ఉన్నది. నీ నియమానికి నేను సంతోషంగా ఒప్పుకుంటాను," అన్నాడు.

ఆమె అతనితో బాటు అతని ఇంటికి వచ్చేసి, అతన్ని పెళ్ళాడింది. ఏ దేవతో తనకు కోడలు కావటం తన పూర్వజన్మ విశేషం అనుకున్నది సమీరుడి తల్లి. ఆమె బతికి ఉన్నంత కాలమూ తన కోడలిని మహా గారాబంగా చూసుకున్నది.

సమీరుడికి నెలలూ, ఏళ్ళూ రెక్కలు కట్టుకుని పోతున్నాయి. అతను తన భార్యతో కాపరం చేస్తూ స్వర్గంలో ఉన్నట్టే భావించాడు. వారికి ముగ్గురు కొడుకులు కూడా పుట్టారు. అతని చెడురోజులు అనుకోని విధంగా ఆరంభమయాయి.

పొరుగున ఉన్న వారింట ఒక పాపాయి పుట్టింది. నామకరణమహోత్సవానికి భార్యా భర్తలను పిలిచారు.

"నే నిప్పుడే చిన్న పని చూసుకుని వస్తాను. ఈ లోపల నువు బట్టలు మార్చుకుని, అలంకరించుకుని బయలు దేరటానికి సిద్ధంగా ఉండు," అని సమీరుడు బయటికి వెళ్ళాడు.



ఒక అరగంట అయాక అతను తిరిగి వచ్చేసరికి అతని భార్య కూర్చున్న చోటి నుంచి కదలనైనాలేదు. అతను ఆమె భుజం తట్టి, "ఇంకా ఇలాగే ఉన్నావేమిటి? వేగిరం సిద్ధంకా!" అన్నాడు,

"నువు నన్ను అకారణంగా కొట్టావు. ఇది మొదటి దెబ్బ. మూడు దెబ్బలు మాత్రం సహిస్తానని నీకు ముందే చెప్పాను," అన్నది భార్య.

సమీరుడు నిర్ఘాంతపోయి, "దీన్ని దెబ్బ అంటావా?" అన్నాడు.

"మరేమనాలీ? అకారణమైన దెబ్బ కూడాను," అన్నది భార్య.



అది మొదలు సమీరుడికి భార్యతో వ్యవహరించటం కత్తిమీది సాములాగా అయింది.

కొంతకాలం గడిచింది. చుట్టుపక్కల ఎవరి ఇంట్లోనో పెళ్ళి అయింది. వాళ్ళు సమీరుణ్ణీ అతని భార్యనూ ఆహ్వానించారు. ఇద్దరూ వెళ్ళారు.

పెళ్ళిలో వరుడు వధువు మెడలో తాళి కట్టుతుండగా సమీరుడి భార్య వెక్కుతూ ఏడవసాగింది. పక్కనే ఉన్న సమీరుడు ఆమె చేతిమీద చిన్నగా తట్టి, "ఊరుకో! శుభమా అని పెళ్ళి అవుతూంటే నీ శోకాలేమిటి?" అన్నాడు రహస్యంగా.

"ఇక వీళ్ళ కష్టాలు ఆరంభమవుతాయి గదా అని ఏడ్చాను. నన్ను అకారణంగా రెండో దెబ్బ కొట్టావు. ముందే చెప్పాను, ఇంకొక్క దెబ్బ కొడితే సహించను," అన్నది సమీరుడి భార్య.

సమీరుడా మాటకు కొయ్యబారి పోయాడు. తన సౌఖ్యమంతా తన చేతుల్లో నుంచి జారిపోతున్న దనిపించింది. తన భార్య అంచనా ప్రకారం తాను ఏక్షణాన అయినా ఆమెను పోగొట్టుకోవచ్చు.

మరి కొంత కాలం జరిగింది. సమీరుడి పొరుగున ఎవరో చనిపోయారు. సమీరుడు తన భార్యతో కూడా పరామర్శకు వెళ్ళాడు. శవం చుట్టూ అందరూ చేరి ఏడుస్తూండగా సమీరుడి భార్య విరగబడి నవ్వసాగింది. సమీరుడు అప్రయత్నంగా తన భార్య వీపు తట్టి, "ఊరుకో, ఊరుకో! అందరూ ఏమనుకుంటారు?" అన్నాడు.

ఆమె మరింత గట్టిగా నవ్వుతూ, "చచ్చిన మనిషికి కష్టాలన్నీ తీరిపోయాయి. నన్ను మూడోసారి అకారణంగా కొట్టావు. నాకూ నీకూ కూడా తీరిపోయింది," అని అక్కడి నుంచి బయలుదేరి తిన్నగా సరస్సుకు వెళ్ళి అందులోకి దూకి మాయమయింది. సమీరు డామెను తిరిగి చూడనేలేదు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, సమీరుడి భార్య అంత అక్రమంగా ప్రవర్తించటాని కేమిటి కారణం? పెళ్ళాడే ముందు ఆమె పెట్టిన నియమాలూ, అతను తనను చేతితో హెచ్చరించినప్పుడల్లా కొట్టాడనటమూ, తన ప్రవర్తనను ఆమె సమర్థించుకున్న తీరూ ఆక్షేపణీయమైనవి కావా? ఆమె ఎందు కలా ప్రవర్తించింది? అతని పైన ప్రేమ పోవటం చేతనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సమీరుడి భార్య ప్రవర్తనను ఆమె దృష్టితో చూసి నట్టయితే అందులో అక్రమమూ, ఆక్షేపణీయమూ అయిన దేమీలేదు. ఆమె దేవత అయి ఉండి కూడా ఒక మానవుణ్ణి ప్రేమించి, అతనికి భార్య కావటానికి ఒప్పుకున్నది. ఆమె సమీరుణ్ణి ప్రేమించగలదు గాని, అతని జీవితంలో పాలు పంచుకో లేదు. తమ వైవాహిక జీవితం నుంచి ఎప్పటికైనా విముక్తి పొందే మార్గం ఉండటం తనకు అవసరం కనక ఆమె ముందుగానే నియమం పెట్టింది. పుట్టుకా, పెళ్ళి, చావూ అనేవి మనుషులకూ, దేవతలకూ ఒకటి కాదు. అందుకే ఆమె భారసాలకు పోవాలని ప్రయత్నించ లేదు; వివాహం జరుగుతుంటే ఏడ్చింది; అప్పటికే ఆమెకు తన వైవాహిక జీవితం చాలా బాధాకరంగా పరిణమించి ఉండాలి. తరవాత ఎవరో చనిపోయినప్పుడు ఆనందం పట్టలేక నవ్వింది. నిజానికి ఆమె పొందిన ఆనందం తనకు మానవ జీవితం నుంచి విముక్తి కలుగుతున్నందుకే. వీటన్నిటినీబట్టి ఆమెను గురించి మనం జాలిపడాలి గాని, తప్పుపట్టరాదు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# దానరహస్యం

ఒక వూళ్ళో ఒక దాసుగారుండేవాడు. ఆయన ఊరూరూ తిరిగి, హరికథలు చెప్పి, శ్రోతలు తమ శక్తి కొద్దీ ఇచ్చే డబ్బులతో జీవయాత్ర సాగిస్తూ ఉండేవాడు.

ఒకసారి దాసుగారు ఒక గ్రామానికి వెళ్ళాడు. ఆ వూరి వాళ్ళు ఆయన చేత హరికథ చెప్పించాలని నిశ్చయించారు. అందుకు తగిన స్థలం శేషయ్యా అనే పెద్ద షావుకారు ఇంట మాత్రమే ఉన్నది. అందుచేత గ్రామ ప్రముఖులు దాసుగారిని శేషయ్యగారి ఇంటికి తీసుకుపోయి, "వీరి చేత హరికథ చెప్పించాలని నిర్ణయించాం. అది మీ యింట జరిపిస్తేనే బాగుంటుంది. దాసుగారికి మన మంతా మన మన ఉత్సాహ శక్తుల ననుసరించి తలా కాస్తా ముట్టజెప్పి గౌరవింతాం. ఏమంటారు?" అన్నారు.

శేషయ్య నిజానికి రసికుడుకాడు. కాని ఊళ్ళో ఉండే పెద్దలంతా తన గౌరవం నిలబెట్టడం ఆయనకు చాలా సంతోషం. అందుచేత ఆయన, "అయ్యో, అంత కంటేనా? తప్పక మా యింటనే హరికథ ఏర్పాటు చేతాం," అన్నాడు. అంతేకాక, దాసుగారి బస కూడా తన ఇంటనే అని ఆయన పట్టుబట్టాడు.

ఆ రాత్రే పెద్ద షావుకారు గారింటి ముందు గల విశాలమైన ఆవరణలో హరికథ ఏర్పాటయింది. దేవుడి పటం దగ్గిర ఒక పెద్ద పళ్ళెం పెట్టారు. హరికథ వినటానికి వచ్చిన వాళ్ళు తమ శక్తి కొద్దీ దాసుగారికి ఇవ్వ దలచినది అందులో వెయ్యవచ్చు. కొందరు ముందే తా మివ్వదలచినది పళ్ళెంలో వేశారు. కొందరు మటుకు చివరకు వేద్దామని ఆగారు. శేషయ్య దాసుగారికి ఇవ్వటానికి ఒక శాలువా, నూరురూపాయల సంచీ వసారా గదిలో పెట్టి ఉంచి, కథ ముగిసినాక ఇద్దామనుకున్నాడు.

ఆర్. శేషగిరిరావు

ఆ వూళ్ళో చలమయ్య అనే చిన్న షావుకారొకడున్నాడు. ఆయన వస్తూనే దాసుగారి మెడకు మూడు రూపాయలు ఖరీదు చేసే పట్టు కండువా వేసి, పళ్ళెంలో నాలుగు రూపాయలు వేసి ముందు వరసలో కూర్చున్నాడు. ఈ హరికథే తన అధ్వర్యాన జరిపించినట్టయితే ఆయన దాసుగారిని ఇంకా స్త ఘనంగా సత్కరించేవాడే.

పెద్ద షావుకారు శేషయ్య, ఎవరెంతెంత ఇచ్చేదీ ఒక కంట కనిపెడుతూనే ఉన్నాడు. అన్నిటిలోకీ పెద్ద పద్దు చలమయ్యదే. అది కూడా పదిరూపాయల లోపుదే. అలాటప్పుడు తాను ఘటుకు దాసుగారికి నూరురూపాయల నగదూ, ఒక శాలువా ఇచ్చుకోవటం దేనికి? ఓ పదిరూపాయల రొక్కమూ, ఒక జత పంచెలూ ఇస్తే సరిపోతుంది.

దాసుగారు హరికథ ప్రారంభించి చెప్పుకుపోతున్నారు. మధ్యలో శేషయ్య ఏదో పని పడ్డట్టుగా లేచి పసారా గదిలోకి వెళ్ళి, తాను సిద్ధంగా ఉంచిన శాలువా, రూపాయల సంచీ తీసేసి, వాటికి బదులు ఒక ధోవతుల చాపూ, పదిరూపాయలూ ఉంచి వచ్చాడు.

దాసుగారు శేషయ్యగారిని మొదటి నుంచీ కూడా మహాశ్రద్ధగా గమనిస్తూ, ఆయన మనసులో కలిగే ఆలోచనలన్నీ ముఖంలో కనిపెట్టుతూ, శేషయ్య లోపలికి



ఎందుకు వెళ్ళినదీ, ఏమి చేసినదీ పసి కట్టేశాడు. శేషయ్య తిరిగి వచ్చి కూచోగానే ఆయన ఈ విధంగా ఒక పిట్ట కథ చెప్పాడు:

కర్ణుడు మహాదాత. అడిగిన వాడికి లేదని ఎరగడు. ఒకనాడు కర్ణుడు అభ్యంగ నానికి సిద్ధమవుతూండగా ఆయనను యాచించటానికి ఎవరో బ్రాహ్మడు వచ్చాడని పరిచారకులు చెప్పారు. ఆ బ్రాహ్మణ్ణి తన వద్దకు తీసుకురమ్మన్నాడు కర్ణుడు.

ఆ బ్రాహ్మడు వచ్చేసరికి కర్ణుడు ఎడమ చేత బంగారు పాత్రలో నూనె పట్టుకుని, కుడి చేత్తో వంటికి నూనె రాచుకుంటున్నాడు.

"మహారాజా, పేదవాణ్ణి. తమకు తోచినది ఇప్పించండి," అన్నాడు బ్రాహ్మడు.

మహాదాత అయిన కర్ణుడు తన ఎడమ చేత ఉన్న బంగారు గిన్నెను అలాగే బ్రాహ్మడికి ఇచ్చేశాడు.

బ్రాహ్మడు దాన్ని సంతోషంతో స్వీకరించి, "మహాదాతవు! కాని ఎడమ చేత్తో ఎవరైనా దానమిస్తారా? అలా ఇవ్వటంలో గల రహస్యమేమిటి?" అని అడిగాడు.

దానికి కర్ణుడు చిరునవ్వు నవ్వి, "ఇదే దానం ఇచ్చేటప్పుడు అందరూ పాటించవలసిన రహస్యం. చెయ్యదలచిన దానాన్ని జాప్యం లేకుండా చెయ్యాలి. మాట వరసకు, నేను నీకీ గిన్నెను ఇవ్వాలనుకున్న క్షణంలో అది నా ఎడమ చేత ఉన్నది. దాన్ని కుడి చేతికి మార్చుకునే లోపల నా బుద్ధి మారిపోవచ్చు. అందుచేత ఎడమ చేతిలో ఉన్న వస్తువును, ఎడమ చేత్తోనే ఇచ్చాను," అన్నాడు.

ఈ పిట్ట కథ చెప్పి హరిదాసుగారు అసలు కథకు వచ్చాడు. కాని శేషయ్యకు ఆ పిట్ట కథ చెప్పుదెబ్బలాగా తగిలింది. హరికథ పూర్తి అయాక ఆయన దాసుగారికి, తాను ముందుగా ఇవ్వాలనుకున్న కానుక కన్న కూడా ఘనంగా ఇచ్చి, గౌరవించి పంపాడు.






# వెర్రివెధవ

ఒక గ్రామంలో ఒక ఆసామీకి ముగ్గురు కొడుకులుండే వాళ్ళు. పెద్దవాళ్ళిద్దరూ తెలివైనవాళ్ళే, కాని మూడోవాడు పరమ మూఢుడు. అందుచేత వాళ్ళ తండ్రి పోయినప్పుడు, పెద్దవాళ్ళిద్దరూ ఆస్తి పంచేసుకుని, మూడోవాడి కేమీ ఇచ్చారుకాదు.

"అంతా మీరే తీసుకున్నారు, అన్యాయం," అన్నాడు మూడోవాడు.

"నువు వెర్రి వెధవవు! నీకే మిచ్చి లాభంలేదు. దక్కించుకోలేవు," అన్నారు అన్నలు. మూడోవాడు వినక మొరాయించాడు. అన్నలు వాడి కొక ముసలి ఎద్దును ఇచ్చి, "ఇది నీవంతు, తీసుకో," అన్నారు. మూడోవాడు తన వంతు కూడా తనకు వచ్చినందుకు సంతోషపడ్డాడు.

ఇంతలో అడవి అవతలపక్క సంత వచ్చింది. గ్రామం నుంచి చాలామంది అమ్మటానికి ఏవేవో సరుకులు తీసుకుపోతున్నారు. తన ముసలి ఎద్దును సంతలో అమ్మాలనిపించింది మూడోవాడికి.

అడవిలో ఎండిపోయిన చెట్టొకటి కాలిదారి పక్కనే ఉన్నది. అది గాలికి ఊగుతూ కిర్రుకిర్రు మంటున్నది. మూడోవాడు తన ఎద్దును తోలుకుని ఆ చెట్టుపక్కగా పోతూ, అది చేసే కిరకిర శబ్దం విని, ఆగి, "ఏమిటీ? నా ఎద్దును కొంటావా?" అన్నాడు.

చెట్టు కిర్రుకిర్రు మన్నది.

"అలా అయితే, ఒకటే బేరం—ఇరవై రూపాయలు. ఇష్టముంటే కొను, లేకపోతే మానెయ్యి," అన్నాడు మూడోవాడు.

చెట్టు మళ్ళీ కిర్రుకిర్రు మన్నది.

"సొమ్ము రేపిస్తానంటావా? మళ్ళీ మాట తప్పవుకద? రేపు మళ్ళీ వస్తాను. ఇదుగో, నీ ఎద్దును నువు ఉంచుకో," అంటూ వాడు తన ముసలి ఎద్దును ఆ ఎండు చెట్టుకు కట్టేసి ఇంటికి తిరిగి వచ్చేశాడు.

వి. సూర్యకుమారి



"సంతలో ఎద్దును అమ్మావా?" అని అన్నలు అడిగారు.

"ఆహా, అమ్మేశాను," అన్నాడు మూడో వాడు సంతోషంగా.

"ఎంత కమ్మావు?" అని అన్న లడిగారు.

"ఇరవై రూపాయలకు," అన్నాడు మూడోవాడు.

"డబ్బేదీ?" అని అన్నలు అడిగారు.

"డబ్బింకా చేతికి రాలేదు, రేపు వస్తుంది," అన్నాడు మూడోవాడు.

"వెర్రివెధవ!" అని అన్నలు వాణ్ణి నానాతిట్లూ తిట్టారు.

మర్నాడు మూడోవాడు అడవిలో ఉన్న ఎండుచెట్టు వద్దకు వెళ్ళాడు. అక్కడ ఎద్దు లేదు. దాన్ని తోడేళ్ళు మాయం చేశాయి.

"నా డబ్బెక్కడ?" అని మూడోవాడు చెట్టు నడిగాడు.

గాలికి ఊగుతూ చెట్టు కిర్రుకిర్రు మన్నది.

"మళ్ళీ రేపా? అదే నాకు మంట! రేపు డబ్బు కక్కకపోతే ఏం చెయ్యాలో అదే చేస్తాను," అని వాడు ఇంటికి వచ్చేశాడు.

"ఎద్దు నమ్మిన డబ్బు చేతికి వచ్చిందా?" అని అన్నలు వాణ్ణి అడిగారు.

"లేదు. రేపుట," అన్నాడు మూడోవాడు.

"ఇంతకూ ఎద్దు నెవరి కమ్మావు?" అని అన్నలు మళ్ళీ అడిగారు.

"అడివిలో ఉండే ఎండుచెట్టుకు," అన్నాడు మూడోవాడు.

"వెర్రివెధవ!" అని తిట్టారు అన్నలు.

మూడోనాడు మూడోవాడు గొడ్డలి పట్టుకుని చెట్టు వద్దకు వెళ్ళి, "ఏదీ నా డబ్బు?" అని గద్దించి అడిగాడు.

చెట్టు గాలికి ఊగుతూ కిర్రుకిర్రు మన్నది.

"మళ్ళీ అదే మాటా?" అంటూ మూడోవాడు గొడ్డలితో దాని పంగలో ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బకు ఒక కొమ్మ విరిగి పడింది. కొంత బంగారం కింద రాలింది.

ఆ చెట్టు పంగలో లోతైన తొర్ర ఉన్నది. అందులో దొంగలు బోలెడంత బంగారం దాచుకున్నారు. మూడోవాడు తాను మోయ గలిగినంత బంగారం మూటగట్టుకుని ఇంటికి పరిగెత్తి అన్నలకు చూపాడు.

అన్నలా బంగార మంతా చూసి నిర్ఘాంత పోయి, "ఎక్కడిదిరా నీ కింత బంగారం?" అని అడిగారు.

"నా ఎద్దును కొన్న చెట్టు లేదూ, దాని తొర్రలో ఉన్నది. నేను కొంచెమే తెచ్చాను. ఇంకా బోలెడంత బంగారం ఉన్నది. మీరు కూడా రండి, తెచ్చుకుందాం," అన్నాడు మూడోవాడు.

ముగ్గురూ అడివికి పరిగెత్తి, చెట్టుతొర్రలో ఉన్న బంగార మంతా మూడు మూటలు కట్టుకుని, ఇంటికి బయలుదేరారు.

దారిలో వారికి గ్రామపెద్ద ఎదురై, "ఏమిటోయ్ ఆ మూటలూ?" అని అడిగాడు.

"కందగడ్డలు!." అన్నారు అన్నలు.

"శుద్ధ అబద్ధం! బంగారం! చూడు కావలిస్తే," అంటూ మూడోవాడు తన మూట విప్పి గ్రామపెద్దకు చూపించాడు.

అంత బంగారం చూసేసరికి గ్రామ పెద్దకు మతిపోయింది. ఆయన మూడో వాడి మూట మీద కలియబడి గుప్పిళ్ళతో బంగారం తీసుకోసాగాడు. అది చూసి



మూడోవాడు తన గొడ్డలితో గ్రామపెద్ద నెత్తిన ఒక్కటి పెట్టాడు. ఆ దెబ్బతో గ్రామపెద్ద పెద్దల్లో కలిశాడు.

"ఏం పని చేశావురా, వెర్రివెధవా! నీ ప్రాణాల మీదికీ, మా ప్రాణాల మీదికీ కూడా తెస్తివే! ఈ శవాన్ని ఏం చెయ్యాలిప్పుడు?" అన్నారు అన్నలు.

ఏం చెయ్యాలో పాలుబోక చివరకు వాళ్ళు ఆ శవాన్ని దగ్గిరలో ఉన్న ఒక పాడు గుడిసెలోకి తీసుకుపోయి, దాని నేలలో గుంట తవ్వి, శవాన్ని పూడ్చి ఇంటికి వెళ్ళారు.

కాని అంతమాత్రానికే ప్రమాదం తప్పినట్టు కాదు. గ్రామపెద్ద కోసం జనం వెతుకుతారు. వెర్రివెధవ అయిన తమ తమ్ముడు వాళ్ళకు శవాన్ని పాతిన చోటు చూపించి, జరిగినదంతా చెబుతాడు.

అందుకని ఆ రాత్రి అన్నలిద్దరూ ఆ పాడు గుడిసెకు తిరిగివచ్చి, గ్రామపెద్ద శవాన్ని తవ్వేసి, దాని స్థానంలో ఒక చచ్చిన మేకను పాతేసి, గ్రామపెద్ద శవాన్ని మరెక్కడో పూడ్చిపెట్టి, ఇళ్ళకు వెళ్ళిపోయారు. రెండు మూడు రోజులు గడిచాక గ్రామపెద్ద కోసం గ్రామస్థులందరూ వెతకనారంభించారు.

మూడోవాడు కొందరిని సమీపించి, "మీరు దేని కోసం వెతుకుతున్నారో నాకు తెలుసులే! గ్రామపెద్ద ఏమయాడని ఒక్కడూ నన్నడగడేం? నేనే ఆయన్ని చంపేశాను. మా అన్నలు శవాన్ని ఎక్కడ పాతేశారో చూపిస్తా రండి," అన్నాడు.

వాడు జనాన్ని పాడుపడిన గుడిసెకు తీసుకుపోయి, "ఇక్కడ తవ్వండి, మీకు శవం దొరుకుతుంది," అన్నాడు.

గ్రామస్థులు వాడు చూపిన చోట తవ్వితే మేకశవం దొరికింది.

"వెర్రివెధవ!" అనుకుని గ్రామస్థులు వెళ్లిపోయారు.







# తగిన శాస్తి

అక్బరు పాదుషా ఆస్థానంలో బీర్బల్‌తో పాటు అతని చిన్ననాటి స్నేహితు డొక డుండేవాడు.

బీర్బల్ తన ప్రతిభ వల్ల పాదుషాకు అభిమాన పాత్రుడయ్యాడు. అతని స్నేహితుడు మాత్రం సంసారపు గొడవల్లో పడి మునిగి తేలుతూ పాదుషాను సంతోష పెట్టలేక పోయేవాడు. అందుచేత, బీర్బల్ పైన అతనికి అసూయ ఏర్పడింది.

ఒకనాడు పాదుషా, "అర్థంలేని మాటలకు గూఢార్థం ఉంటుందా?" అని సభలో ప్రశ్న వేశాడు.

వెంటనే బీర్బల్, "ఉంటుంది, మహారాజా," అన్నాడు.

బీర్బల్ స్నేహితుడు లేచి, "అది అబద్ధం, మహారాజా. అర్థంలేని మాటలకు గూఢార్థం ఎలా ఉంటుంది? అలాంటివి నే నెన్నో మాట్లాడగలను," అన్నాడు.

తన స్నేహితుడి దుర్బుద్ధి బీర్బల్‌కు అర్థమయింది. అతనికి బాగా బుద్ధి చెప్పాలనుకుని బీర్బల్, "నువు అర్థంలేని మాటలు కొన్ని చెప్పు. పాదుషావారు సమ్మతిస్తే నేను వాటికి గూఢార్థాలు చెబుతాను," అన్నాడు. పాదుషా సమ్మతించాడు. ఆయనకు కావలిసిందే అది.

బీర్బల్ స్నేహితుడు గొంతు సవరించుకుని, "తల్లికీ, తండ్రికీ పుట్టనివాడు, తాగి తండ్రిని కొట్టాడు," అన్నాడు.

ఈ మాటకు అందరూ ఆశ్చర్యపోయారు. తండ్రికీ తల్లికీ పుట్టనివాడంటూ ఎలా ఉంటాడు? ఉంటే వాడు తాగి తండ్రిని ఎలా కొడతాడు? అందరూ బీర్బల్ కేసి చూడసాగారు.

బీర్బల్ క్షణం ఆలోచించి, "సాధారణంగా ఎవడూ తనను కని పెంచిన తల్లిదండ్రులను కొట్టడు. అలాటి పని చేసేవాణ్ణి

పఠాన్ ఖాదర్ వలీఖాన్

తల్లికీ, తండ్రికీ పుట్టనివాడంటాం. తాగి తండ్రిని కొట్టిన వాడు తల్లికీ, తండ్రికీ పుట్టని వాడనిపించుకోవటంలో ఆశ్చర్యం ఏమున్నది?" అన్నాడు.

బీర్బల్ స్నేహితుడు ఈ సమాధానానికి బిత్తరపోయాడు. సభికులందరూ బీర్బల్ సమాధానానికి హర్షధ్వానాలు చేస్తూంటే అతనికి మతిపోయినట్టయింది. కొంతసేప టికి అతను తేరుకుని, మరో అర్థంలేని మాట ఈ విధంగా చెప్పాడు:

"పాదుషావారు వేటకు వెళితే, తన గూటికి పోతున్న పక్షి పాదుషావారిని చూసి నీటిలో దాగుంది."

బీర్బల్ తడుపుకోకుండా, "అది సహజమే. పాదుషావారు వేటాడుతుండగా, గూటికి వెళుతూ ఒక పక్షి కనబడింది. పాదుషావారు దాన్ని గురిగా కొట్టారు. అది కింద వున్న చెరువులో పడి మునిగి పోయింది," అన్నాడు.

మళ్ళీ సభికులు పెద్దగా హర్షధ్వానాలు చేశారు. ఈసారి బీర్బల్ స్నేహితుడు, "గడ్డి చాలక గాడిద సింహాన్ని తన్నింది. ఇందులో గూఢార్థమేమిటి?" అన్నాడు.

"లేకేం? సింహం మృగరాజు. గాడిద సేవకుడు. గాడిదకు గడ్డి చాలలేదంటే జీత భత్యాలు చాలలేదన్నమాట. అందుచేత గాడిద సింహాన్ని తన్నింది. ఇందులోని గూఢార్థమేమంటే, పాదుషావారు సింహం. మన మిత్రుడు గాడిద. అతనికి గడ్డి, అంటే పాదుషావారిచ్చే భత్యం చాలటంలేదు. అందుచేత అతను పాదుషావారిని తన్నాలని చూస్తున్నాడు," అన్నాడు బీర్బల్.

తన కలాటి దురభిప్రాయం ఎన్నడూ లేదని బీర్బల్ స్నేహితుడు పాదుషావారికి మరీ మరీ తెలుపుకున్నాడు. అతనికి నిండు సభలో గొప్ప పరాభవమయింది. అదే సభలో పాదుషా బీర్బల్‌ను సత్కరించి, గౌరవించాడు.





# వృత్తి విద్య

జయపురంరాజుకు జయంతు డని ఒకే ఒక కొడుకుండేవాడు. అతనికి జయపాలు డనే చెలికా డొకడుండేవాడు. ఈ ఇద్దరూ గుర్రా లెక్కి రోజూ ఉదయం బయలుదేరి, కొండల్లో వేటకుపోయి, సాయంకాలానికి తిరిగి వచ్చేవారు. వేటకు పోయేటప్పుడు జయంతుడూ, జయపాలుడూ అతి సాధారణమైన దుస్తులు, ఒకే రకమైనవి, ధరించేవారు. చూసేవారికి ఎవరు రాజు కొడుకైనదీ, ఎవడు సేవకుడైనదీ తెలిసేదికాదు.

ఒక రోజు జయంత జయపాలులు వేటాడి, అలిసిపోయి సాయంకాలం వేళ తిరిగి వస్తుండగా జయంతుడికి తగని దాహ మయింది. వాళ్ళు ఒక గ్రామం వెలపల ఉన్న బావి వద్దకు వచ్చారు. ఆ బావి దగ్గిర కొందరు ఆడపిల్లలు నీరు చేదుతున్నారు. జయంతుడు వారిని సమీపించి, తాగడానికి మంచి నీరివ్వమని అడిగాడు. ఒక పిల్ల తన కడవలో నుంచి లోటాలోకి నీరు వంచి జయంతుడి కివ్వబోయింది. మరొక పిల్ల ఆమె చేతి లోటా లాగేసుకుని, ఆ నీరు అవతల పారబోసి, మరొకసారి లోటా నించి, ఆ నీటిని కూడా అవతల పారబోసింది. ఇలా ఆ పిల్ల ఆరుసార్లు లోటాను నీటితో నింపి అవతల పారబోసి, ఏడో సారి నింపిన లోటాను జయంతుడి చేతికి అందించింది.

జయంతు డా నీటిని ఆత్రంగా తాగి, "మొదటిసారే నీరెందు కిచ్చావు కావు? నన్ను ఏడ్పించడానికా, ఉడికించడానికా?" అని ఆ పిల్లను అడిగాడు.

"ముక్కూ ముఖమూ తెలియని వాళ్ళను బాధించే అలవాటు మాకు లేదు. నీరు చాలా చల్లగా ఉన్నది. మీరు మరీ వేడెక్కి ఉన్నారు. అందుచేత కాస్త జాప్యం చేశాను," అన్నదామె.

సి. మాధవరావు



అమె ఇచ్చిన జవాబుకు జయంతుడు ఆశ్చర్యపోయాడు. ఆమె చాలా అందగత్తెగా కూడా ఉన్నది. "నీ పేరేమిటి?" అని అతనామె నడిగాడు.

"నా పేరు మాధవి. మా తండ్రి గొర్రెల కాపరి. ఎందుకలా అడిగారు?" అన్నదామె.

'అడగకూడదా? తప్పా?" అన్నాడు జయంతు డాశ్చర్యంతో.

"తప్పు కానట్టయితే మీ పేరేమిటో, మీ రెవరో కూడా చెప్పవద్దా?" అని ప్రశ్నించింది మాధవి.

"నిజం చెప్పనా, అబద్ధం చెప్పనా?" అని జయంతు డడిగాడు.

"మీ స్వభావానికి తగినట్టు ఏదో ఒకటి చెప్పండి," అన్నది మాధవి.

"నిజమే చెప్పాలనుకో. కాని నే నెవరో ఇప్పుడు చెప్పలేను. తరవాత నీకు తప్పక తెలుస్తుందని మటుకు మాట ఇస్తున్నాను," అన్నాడు జయంతుడు.

తరవాత జయంతుడూ, జయపాలుడూ అక్కడి నుంచి కదిలి తమ నగరానికి వెళ్ళిపోయారు.

మాధవి తప్ప తనకు మరొక భార్య అవసరం లేదని అనాడే జయంతుడు రూఢి చేసుకున్నాడు. అతని మనస్సు మారదని గ్రహించాక అతని తల్లిదండ్రులు ఈ పెళ్ళికి సమ్మతించారు.

రాజుగారి కొలువులో ఉండే ఇద్దరు పెద్ద ఉద్యోగులు, ప్రధానానికని కొన్ని రత్నాభరణాలూ, పట్టుబట్టలూ తీసుకుని, జయపాలుణ్ణి వెంటబెట్టుకుని, మాధవి ఉండే గ్రామానికి వెళ్ళి, ఆమె తండ్రి అయిన గొర్రెలకాపరిని కలుసుకున్నారు.

"రాజుగారు తమ కుమారుడికి మీ అమ్మాయిని చేసుకో గోరుతున్నారు. ఈ పెళ్ళి జరిగితే, రాజుగారి అనంతరం మీ అమ్మాయి పట్టపురాణి అవుతుంది," అని చెప్పారు వాళ్ళు గొర్రెలకాపరితో.





వచ్చిన వాళ్ళకు ఫలాలు తెచ్చి ఇచ్చి, మగ్గం మీద తివాసీ నేయడానికి కూర్చున్న మాధవిని చూసి ఆమె తండ్రి, "నా దేమీ లేదు. అంతా దాని ఇష్టం," అంటూ మాధవిని పిలిచాడు.

ఆమె మగ్గం మీది నుంచి లేచి వచ్చింది. జయపాలు డామెకు ప్రధానపు నగలూ, బట్టలూ చూపి, "రాజుగారు వీటిని నీ కోసం పంపారు," అన్నాడు.

ఆమె వాటి కేసి నిర్లక్ష్యంగా ఒక్కసారి చూసి, "రాజుగారికి నా పైన ఇంత అనుగ్రహం దేనికి కలిగిందో?" అన్నది.

"రాజకుమారుడైన జయంతుడికి ఒక నాడు నువు మంచి నీరిచ్చావు. అతనికి నువంటే ఇష్టమయింది. అతనికీ నీకూ పెళ్ళి చేయ నిశ్చయించి, రాజుగారు నీ కీ రత్నాల పట్టెడా, రవ్వల ఉంగరమూ, కంకణాలూ, పట్టు బట్టలూ పంపారు," అన్నాడు జయపాలుడు.

"అయితే అనాడు నేను నీళ్ళిచ్చినది రాజకుమారుడికా? అందచందాలు గల వాడే – కాని అతనికి వృత్తివిద్య ఏదైనా తెలుసునా?" అని మాధవి అడిగింది.

"అతను రాజుగారి కొడుకు! అతనికి అన్ని వృత్తులవాడూ సేవకులే. అలాటప్పుడు అతనికి వేరే వృత్తివిద్య దేనికీ?" అని జయపాలు డన్నాడు.

"కావచ్చుగాక. కాని కాలం ఎలా నడిచేదీ ఎవరు చెప్పగలరు? ఇవాళ యజమాని అయినవాడు రేపు సేవకుడు కావచ్చు. రాజయేది, సేవకుడయేది, ప్రతివాడికీ ఒక వృత్తివిద్య తెలిసి ఉండాలి. రాజకుమారుడంటే నా కిష్టమే గాని, వృత్తివిద్య రాని వాణ్ణి నేను పెళ్ళాడలేను. ఈ నగలన్నీ తీసుకుపొండి. రాజకుమారుడికి నా క్షమాపణలు చెప్పండి." అన్నది మాధవి.

రాజదూతలు తిరిగి వెళ్ళి మాధవి అన్న మాటలు చెప్పగానే జయంతుడి తల్లి



దండ్రులు పరమానందం చెంది, ఇక తమ కుమారుడు తనకు తగిన రాజకుమార్తెను ఎవతెనైనా పెళ్ళాడగలడని ఆశపడ్డారు.

కాని జయంతుడు, "మాధవి నిజం చెప్పింది. అందరి లాగా నేను కూడా ఏదో వృత్తివిద్య నేర్చుకోవలిసిందే," అన్నాడు.

రాజు తన మంత్రు లందరి సలహా పొంది, తన కొడుకు సరిగతో బట్ట లల్లడం నేర్చినట్టయితే ఘనంగా ఉంటుందని నిశ్చ యించాడు.

దేశదేశాల నుంచి సరిగ నిపుణులను పిలిపించి, జయంతుడికి బంగారు పోగు లతో చిత్రవిచిత్రమైన బట్టలల్లడం నేర్పిం చారు. కొంతకాల మయాక అతను ఒక అందమైన బంగారువస్త్రం నేసి, జయ పాలుడి ద్వారా దాన్ని మాధవికి కాను కగా పంపాడు.

"ఇలాంటి పనితనం తెలిసిన వాడికి దారిద్ర్యబాధ ఉండదు. నేను రాజకుమా రుణ్ణి పెళ్ళాడడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నది మాధవి.

త్వరలోనే జయంతుడికీ, మాధవికీ మహావైభవంగా వివాహం జరిగింది.

ఈ వివాహం జరిగిన కొద్ది కాలానికే జయపాలుడు కనిపించకుండా పోయాడు. అతని కోసం తెగవెతికి, చివరకు ఆశ వదులుకున్నారు. మరి కొంత కాలానికి రాజుగారు వృద్ధాప్యం వల్ల, పండు రాలి నట్టు, రాలిపోయాడు. జయంతుడు రాజుగా అభిషేకం పొందాడు.

ఒకనాడు మాధవి తన భర్తతో, "మీరు పేరుకు రాజన్న మాటే గాని, మీకు రాజ్యం గురించీ, ప్రజలను గురించీ నిజంగా ఏపాటి తెలుసు? ఏమీ తెలీదు. మీ దగ్గిర కొలువు చేసేవారు, అంతా దివ్యంగా ఉన్నదని చెబు తారు. అది ఏమాత్రమూ నిజం కాకపోవచ్చు. మీరు అడపాదడపా మారువేషాలు వేసు కుని, ఏ బిచ్చగాడుగానో, వర్తకుడుగానో

నటిస్తూ రాజ్యమంతటా సంచారం చేసి, వాస్తవ పరిస్థితులు తెలుసుకుంటూ ఉండాలి," అన్నది.

"అది నిజమే, మాధవీ. నేను సామాన్యపు దుస్తులు ధరించి వేటకు వెళ్ళే రోజులలో నాకు గ్రామాలలో ఉండే సంగతులన్నీ తెలుస్తూ ఉండేవి. ఇప్పుడు రాజభవనంలో బందీనయాను. నేను వెళ్ళిపోతే రాజ్యభారం ఎవరు మోస్తారు?" అన్నాడు జయంతుడు.

"నేను మోస్తాను. విచారించకండి, మీరు రాజధానిలో లేరన్న సంగతి కూడా ఎవరికీ తెలియనివ్వను," అన్నది మాధవి.

ఆ ప్రకారమే జయంతుడు ఒక పేద రైతులాగా వేషం వేసుకుని, రాజ్యమంతటా సంచారం చెయ్యడానికి బయలుదేరాడు. అతను ఒకనాడు శక్తిపాదం అనే నగరం చేరి రచ్చబండ వద్ద కూర్చుని ఉండగా, అటు కేసి ఒక వృద్ధుడు వచ్చాడు. ఆ వృద్ధుడి వెంట అనేకమంది శిష్యులున్నారు. ఆయనకు ముందుగా కొందరు నౌకర్లు, "తొలగండి, తొలగండి!" అని జనాన్ని హెచ్చరిస్తూ పోతున్నారు, మరి కొందరు ఆ వృద్ధుడి అడుగులకు మడుగులొత్తుతున్నారు.



"ఎవరీస్వామి?" అని జయంతుడు తన సమీపంలో నిలబడి ఉన్న ఒక మనిషిని అడిగాడు.

"ఇంత గొప్పవాణ్ణి ఎరగవా? శక్తి ఆలయం పెద్ద పూజారి. మహాత్ముడు. కాలి కింద చీమలూ, చిన్న చిన్న పురుగులూ నలిగి చస్తాయని నేలపైన నడవడు. ఆయనను శక్తియోగి అంటారు," అన్నాడా మనిషి.

శక్తియోగి రచ్చబండ దగ్గిర ఆగి, తన భృత్యులు పరిచిన రత్నకంబళం మీద కూర్చుని, విశ్రాంతి తీసుకోసాగాడు. జనం ఆయన చుట్టూ చేరి, ఆయన ముందు సాష్టాంగాలు పడసాగారు.



జయంతుడు కూడా ఆ జనాన్ని తోసుకుంటూ ముందుకు పోయాడు. అతను కొత్తవాడని శక్తియోగి కనిపెట్టి, "ఎవరు, నాయనా, నువు? ఏం పని చేస్తావు?" అని అడిగాడు.

"మాది దూరదేశం. ఎక్కడన్నా పని దొరుకుతుందేమోనని చూస్తూ తిరుగుతున్నాను," అన్నాడు జయంతుడు.

"పనే గద! నేను చూపిస్తాను. నా వెంటరా," అన్నాడు శక్తియోగి. జయంతుడు సమ్మతించినట్టు తల ఆడించాడు. శక్తియోగి తన శిష్యుల చెవిలో ఏదో చెప్పాడు. వాళ్ళు వెంటనే బయలుదేరి వెళ్ళి, కూలివాళ్ళ చేత ఏవేవో సరుకులు మోయించుకుంటూ తిరిగి వచ్చారు.

అప్పుడు శక్తియోగి లేచి నిలబడి తనను చూడ వచ్చిన పౌరుల నందరినీ ఆశీర్వదించి, తన శిష్యులనూ, బరువులు మోసే వాళ్ళనూ వెంట బెట్టుకుని బయలుదేరాడు. జయంతుడు కూడా వారి వెంటనే వెళ్ళాడు. కొంతసేపటికి అందరూ నగరం దాటి ఒక ఎత్తయిన ప్రాకారం గల చోటు చేరుకున్నారు. ఆ ప్రాకారాని కొక పెద్ద ద్వారం ఉన్నది. శక్తియోగి పెద్ద తాళం చెవితో ఆ ద్వారం తలుపులు తెరిచాడు.

లోపల, ప్రాకారపు గోడల మధ్య ఒక ఆలయం ఉన్నది. దాని చుట్టూ గదులున్నాయి. కూలివాళ్ళు తమ మూటలను ఆలయం ముందు దించారు. ఆ కూలీలనూ, జయంతుణ్ణి శక్తియోగి ఆలయం వెనుక ప్రాంతానికి తీసుకుపోయి, ఒక ఇనపతలుపు తెరిచి, "మీరంతా లోపలికి వెళ్ళండి. మీరు చేసేపనులు చెబుతారు," అన్నాడు. వాళ్ళు లోపలికి వెళ్ళగానే శక్తియోగి ఇనపతలుపు బయటి నుంచి మూసి, తాళం పెట్టాడు.

లోపల చీకటిగా ఉన్నది. దారి కూడా దిగువకు పోతున్నది. అలా కొంతదూరం భూగర్భంలోకి ఏటవాలుగా దిగి వెళ్ళాక,

దూరాన చిన్న దీపం కనబడింది. అదే సమయంలో నల్లని ఆకారం ఒకటి దారికి అడ్డంగా వచ్చింది. జయంతుడా ఆ కారాన్ని సమీపించి చూశాడు. ఎవరో అస్థిపంజరం లాగున్నాడు.

"నా వెంట రండి. అంతా చూపిస్తాను," అంటూ ఆ మనిషి కొత్తగా వచ్చిన వాళ్ళను భూగర్భంలో ఉన్న వేరు వేరు గుహలలోకి తీసుకుపోయాడు. వాటిని చూస్తూంటే జయంతుడికి నరకం స్ఫురించింది. ఒక చీకటి గుహలో ఎంతోమంది మరణవేదనలో ఉన్నారు. మరొక గుహలో కొన్నివందల మంది వేరు వేరు పనులు చేస్తున్నారు. అందరూ పాలిపోయి, చావడానికి సిద్ధంగా ఉన్నట్టే ఉన్నారు.

ఆ అస్థిపంజరంలాటి మనిషి వాళ్ళకు ఇలా చెప్పాడు:

"ఆ రాక్షసి పూజారి మమ్మల్ని కూడా మిమ్మల్ని తెచ్చినట్టే మోసం చేసి ఇక్కడికి తెచ్చాడు. నేనిక్కడ ఎన్నేళ్ళుగా ఉన్నానో తెలీదు. నాతోబాటు వచ్చిన వాళ్ళలో ఒక్కడూ చావక మిగలలేదు. ఈ రాక్షసులు పనులు నేర్చిన వాళ్ళనూ, నేర్వని వాళ్ళనూ కూడా తెస్తారు. పనులు చేతయిన వాళ్ళను పనులు చేయించి చంపుతారు. మిగిలిన వాళ్ళను నరికి చంపుతారు. మొత్తం మీద





అందరినీ పండుకు తింటారు. నరభక్షకులు! పిశాచాలు! పెద్ద పూజారికి మిగిలిన పూజారులంతా తోడు దొంగలు!"

అతను మాట్లాడుతూండగానే జయంతుడు అతన్ని గుర్తుపట్టాడు. అతను జయపాలుడు. కాని ఆశ్చర్యంతో గుండె అవిసి చస్తాడేమోనని జయంతు డతనికి తా నెవరో చెప్పలేదు.

ఇంతలో అడుగుల చప్పుడయింది. యమకింకరుడు లాటి ఒక పూజారి కొందరు సాయుధులను వెంట బెట్టుకుని అక్కడికి వచ్చి, "మీరేనా కొత్తగా వచ్చిన వాళ్ళు?" అని అడిగాడు.

"అవును, ధర్మప్రభో!" అన్నాడు జయంతుడు.

"మీలో వృత్తి పని చెయ్యగలవారెవరు?" అని పూజారి అడిగాడు.

"మే మందరమూ చేస్తాము. మేము సరిగబట్టలు అల్లగలము. వాటి ఖరీదు బంగారానికి నూరింతలుంటుంది," అన్నాడు జయంతుడు.

"నిజమా?" అన్నాడు పూజారి.

"పనిముట్లు తెండి, మీరే చూస్తారు!" అన్నాడు జయంతుడు.

"మీకే మేం పనిముట్లు కావాలి? ఏం ముడిసరుకు కావాలి?"

జయంతుడు జవాబు చెప్పి, "మేము మాంసం తినము. దయచేసి మాకు శాకాహారం ఇప్పించండి," అన్నాడు.

పూజారి వెళ్ళిపోయి వాళ్ళకు భోజనం పంపాడు. జయంతు డా ఆహారాన్ని తనతో ఉన్నవాళ్ళకేగాక, జయపాలుడికీ, ఇంకా గుహలలో బతికి ఉన్నవాళ్ళకూ కూడా పంచిపెట్టాడు.

పూజారి పంపిన వస్తువులతో అతను అద్భుతమైన జరీ దుప్పటి అల్లాడు. అందులో తాను అక్కడ చూస్తున్న దృశ్యాలన్నీ చిత్రించటమే గాక, ఒక సందేశం

కూడా అల్లాడు. దాన్ని అందరూ తేలికగా చదవలేరు.

పూజారి వచ్చి ఆ సరిగ దుప్పటిని చూసి, పనితనాన్ని మెచ్చుకున్నాడు.

"ఇది బంగారానికి నూరింతలు విలువ చేస్తుందన్నానే గాని, పనితనం తెలిసిన వాళ్ళయితే బంగారానికి రెండువందల రెట్లిచ్చి అయినా కొనేస్తారు. అయితే అలా పనితనం తెలిసిన వాళ్ళు ఎక్కడున్నారు— రాణి మాధవీదేవి తప్పిస్తే?" అన్నాడు జయంతుడు పూజారితో.

పూజారికి దురాశ పుట్టింది. మిగిలిన పూజారు లెవరికీ తెలియకుండానే దీన్ని తీసుకుపోయి రాణి మాధవీదేవికి అమ్మి లాభం అంతా తానే కాజేద్దామని ఆ దుర్మార్గుడు నిశ్చయించుకున్నాడు. వాడు ఆ బంగారు దుప్పటిని పెద్ద పూజారికి కూడా చూపకుండా జయపురానికి బయలు దేరి వెళ్ళాడు.

తన కోసం ఎవరో వర్తకుడు అమూల్యమైన సరిగ వస్త్రం తెచ్చినట్టు నౌకర్లు చెప్పే సరికి, మాధవి పూజారిని లోపలికి రానిచ్చింది. ఆమె పూజారి ఇచ్చిన దుప్పటిని విప్పిచూడక, "దీని వెల ఎంత?" అని అడిగింది.



"మహారాణీ, బంగారానికి మూడువందల రెట్లు. పనితనం చూపినట్టయితే దాని విలువ తమరే గ్రహించగలరు. నాణ్యం గుర్తించ గలరనే ధైర్యంతోనే ఇంత దూరం మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను," అన్నాడు పూజారి. మాధవి నమ్మలేకుండానే దుప్పటి విప్పింది. మరుక్షణమే ఆమెకు తన భర్త అందులో అల్లిన సందేశం కంటపడింది:

"ప్రియమైన మాధవీ, నేను నరకంలో చిక్కుకుపోయాను. ఈ బట్టను నీ దగ్గిరికి తెచ్చేవాడు అక్కడి యమకింకరులలో ఒకడు. జయపాలుడు కూడా ఇక్కడే ఉన్నాడు. శక్తిపాదానికి తూర్పున ఉన్న

ప్రాకారాల మధ్య నేల అడుగున ఉన్న గుహలలో మా కోసం వెతికించు. నువు అదుకోకపోతే మేమంతా చచ్చిపోతాం— జయంతుడు."

మాధవి ఈ సందేశం చూసుకుని కొయ్యబారి పోయింది. ఆమె ఆ బంగారు దుప్పటి పనితనం మెచ్చుకుంటున్న దానిలాగా చాలాసేపు చూసి, తనను తాను తమాయించుకుని, చివరకు, "నువన్నట్టు దీనికి విలవ కట్టటం సాధ్యంకాదు. అర్ధరాజ్యం ఇచ్చినా నష్టంలేదు. నువ్వడిగిన దానికన్న ఎక్కువే ఇప్పిస్తాను," అంటూ ఆమె తమ మంత్రికి ఒక ఉత్తరం రాసి, నౌకరు చేతికిస్తూ, "దీన్నీ, ఈ మనిషినీ మంత్రిగారికి అప్పజెప్పు," అన్నది.

పూజారి నౌకరు వెంట వెళ్ళాడు. మంత్రి మాధవి రాసిన ఉత్తరం చూస్తూనే, పూజారిని కాళ్ళూ చేతులూ కట్టేయించి, కారాగృహంలో పడేయించాడు.

ఒక్క ఘడియ లోపల మాధవి పెద్ద సేనను వెంట బెట్టుకుని, శక్తిపాదానికి తూర్పుగా ఉన్న ఆలయప్రాకారం మీదికి దాడి చేసి, ద్వారాలు పగలగొట్టి లోపలికి ప్రవేశించింది. పెద్దపూజారి శక్తియోగితో పాటు తతిమ్మా పూజారులందరూ దొరికారు. ఖైదీలందరూ విముక్తులయారు.

అప్పటికి జయపాలుడు జయంతుణ్ణి గుర్తించాడు.

అతను జయంతుడితో, "ఇవాళ మాధవీదేవి మన ప్రాణాలను కాపాడింది,"అన్నాడు.

"వెర్రివాడా, నన్ను వృత్తివిద్య నేర్చుకోమన్ననాడే మన ప్రాణాలను కాపాడింది," అన్నాడు జయంతుడు.

తరవాత జయంతుడు తన భార్యనూ, జయపాలుణ్ణీ వెంట బెట్టుకుని రాజధానికి తిరిగి వెళ్ళి, శక్తియోగి లాటి దుర్మార్గులను కనిపెట్టి హతమార్చుతూ, చాలాకాలంపాటు రాజ్యం చేశాడు.





# నిశ్చలప్రేమ

విక్రమపుర రాజుకు ఒక్కడే కుమారుడు. అతని పేరు ధీరమతి. అతను ఉదార స్వభావుడు, శాంతుడు, సజ్జనుడు, సకల సద్గుణ సంపన్నుడు. కాని క్షత్రియోచితమైన యుద్ధాసక్తీ, అస్త్రకౌశలమూ మొదలైన వేవీ అతనిలో లేవు.

అతని ప్రియురాలు మంజరి. ఆమె విక్రమపురి రాజు యొక్క సామంతుడి కుమార్తె. ఆమె పసిపిల్లగా ఉన్నప్పుడా సామంతు ఆమెను కొందరు దొంగల వద్ద నుంచి కాపాడి, తన కుమార్తెలాగా పెంచి పెద్దదానిని చేశాడు. ఆమె అదృష్టం కొద్దీ యువరాజే ఆమెను ప్రేమించాడు.

అయితే, తన కుమారుడు ఒక అనామకురాలిని ప్రేమించటం రాజు కేమాత్రమూ ఇష్టంలేదు. కాని ధీరమతి, "నేను మంజరిని పెళ్ళాడటానికి వీలులేకపోతే అసలు పెళ్ళే చేసుకోను," అని స్పష్టంగా చెప్పేశాడు.

రాజుకు ఆగ్రహం వచ్చింది. ఆయన సామంతును పిలిపించి, "నీ కూతుర్ని దేశాంతరాలకు పంపెయ్యి. ఆ పిల్ల ముఖం కనిపించిందో, నిలువునా దహనం చేయిస్తాను," అని భయపెట్టాడు.

సామంతు బెదిరిపోయాడు. ఆయన తన కుమార్తెను మేడమీది చీకటి కొట్టులో పెట్టించి, ఆమెకు సేవ చెయ్యటానికి ఒక ముసలిదాన్ని ఏర్పాటు చేశాడు.

మంజరి కనిపించటం లేదు. ధీరమతి సామంతుడి ఇంటికి వెళ్ళి ఆమెను గురించి అడిగితే సామంతు, "మహారాజుగారు తీవ్రమైన అంక్ష పెట్టారు. మీరిద్దరూ ఒకరి నొకరు చూసుకోరాదు, కలిసి మాట్లాడుకోరాదు," అన్నాడు. ధీరమతి ఇంటికిపోయి ఎవరితోనూ మాట్లాడకుండా పడుకుని, దుఃఖించాడు.

ఇదే సమయంలో విక్రమపురం కోట మీదికి పొరుగు రాజైన కేశవపుర రాజు

జె. వీరభద్రయ్య




"ఒక షరతు మీద నేను యుద్ధానికి పోతాను. యుద్ధం నుంచి తిరిగి వచ్చాక, మంజరిని ఒకసారి కలుసుకుని మాట్లాడ నివ్వాలి," అన్నాడు. రాజు సరే నన్నాడు.

ధీరమతి ఎగిరి గంతేశాడు. అతను చప్పున కవచం ధరించి, నడుముకు కత్తి కట్టుకుని, బల్లెమూ, డాలూ చేతబట్టి, గుర్రాన్నెక్కి ఆ క్షణంలోనే మంజరిని కలుసుకో బోతున్న వాడిలాగా అమితోత్సాహంగా గుర్రాన్ని దౌడుతీయిస్తూ ముందుకు సాగాడు. తన గుర్రం ఎటు కేసి పోతున్నదీ కూడా అతను గమనించలేదు. అతను తన సేనను అధిగమించి చాలాదూరం వెళ్ళాడు. శత్రు సైనికులు అతని గుర్రాన్ని ఆపి, అతన్ని ఖైదీగా పట్టుకుని, అతని చేత ఉన్న బల్లెమూ, డాలూ లాగేసి, అతన్ని తీసుకు పోయి శత్రురాజు ముందుంచారు.

దండెత్తి వచ్చాడు. విక్రమపుర రాజు తన కొడుకు దగ్గిరికి వెళ్ళి, "పిరికివాడా! అవతల శత్రువులు వచ్చి కోటకు ముట్టడి వేశారు. నువు సైన్యాలకు ముందుండి శత్రువును తరిమికొట్టకపోగా, ఇలా పడుకుని మూలగటానికి సిగ్గులేదూ?" అన్నాడు.

"నేను మంజరిని పెళ్ళాడలేక పోయాక నగరం ఏమైతే నాకేం?" అన్నాడు ధీరమతి.

"నువు కులగోత్రాలు లేనిదాన్ని పెళ్ళాడే కన్న నగరం నాశనమైనా మేలేనని నాకూ తోస్తున్నది," అన్నాడు రాజు కోపంగా. అయన వెళ్ళిపోబోతుంటే ధీరమతికి ఒక ఆలోచన వచ్చింది. అతను తన తండ్రితో,

మంజరిని కలుసుకుని మాట్లాడబో తున్నట్టు కలలు కంటున్న ధీరమతికి, తాను శత్రువులకు చిక్కాననీ, శత్రురాజు డేరాలో ఉన్నాననీ తెలిసి చాలా ఆశ్చర్యం కలిగింది.

"వీడు విక్రమపుర యువరాజు! వీణ్ణి తలనరికి చంపండి," అన్నాడు శత్రురాజు.

ఆ మాట వినగానే ధీరమతికి శివ మెత్తింది. అతను చప్పున మొలలో ఉన్న

కత్తి పైకి లాగి తనను పట్టుకున్న సైనికు లను రెప్పపాటులో చెండాడి, శత్రురాజు డేరా నుంచి బయటపడి తన కోట కేసి పరి గెత్తాడు. దొరికిన శత్రువు తప్పించుకుని పారి పోతున్నాడన్న ఆందోళనలో శత్రురాజు గుర్రం మీద అతన్ని వెంబడించాడు. ధీరమతి శత్రురాజును గుర్రం మీది నుంచి కిందికి ఈడ్చి, ఖైదీగా పట్టుకుని, ఈడ్చు కుంటూ తన కోట చేరుకున్నాడు.

యుద్ధం అయిపోయింది. శత్రురాజు బందీగా దొరికాడు.

"నీ పని పూర్తి చేశాను. ఇక నీ మాట నిలబెట్టుకుని నన్ను మంజరిని చూడనీ," అన్నాడు ధీరమతి తండ్రితో.

"అలాటి మాట నిలబెట్టుకోవలిసిన పని లేదు!" అన్నాడు తండ్రి.

వెంటనే ధీరమతి శత్రురాజు కట్లు విప్పి, అతని కొక గుర్రం ఇచ్చి, "వెళ్ళు, బాబూ, వెళ్ళు. నువు నాకు చిక్కనూలేదు, నేను నిన్ను పట్టుకోనూలేదు," అన్నాడు.

రాజుకు కొడుకు పైన పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన అతన్ని చీకటి కొట్టులో పెట్టించాడు.

ఈ వార్త నగరమంతటా పాక్కింది. మంజరి ఆ నగరం విడిచి వెళ్ళిపోవటానికి



నిశ్చయించుకుని, ఒక చీకటి రాత్రి నల్లని బట్ట నిలువునా కప్పుకుని, ఎవరితోనూ చెప్పకుండా ఇల్లు వదిలి వెళ్ళిపోయింది. ఆమె నగరం దాటి అరణ్యప్రాంతం దాకా వెళ్ళి, తెల్లవారినదాకా పొదలమధ్యన పడు కుని నిద్రపోయింది. ఆమె తిరిగి లేచేసరికి గొర్రెలు కాసే కుర్రాళ్ళు కనబడ్డారు.

"అబ్బాయిలూ, మీరు రోజూ ఇక్కడికి వస్తూంటారా? అయినట్టయితే, ఈ దేశపు యువరాజుగారు ఇటుగా వేటకు వచ్చి నప్పుడు, మీ రాయనతో, ఈ దిక్కుగా వెళితే వేటకు అనుకూలంగా ఉంటుందని చెప్పండి," అన్నది.



కేసి వెళ్ళాడు. అక్కడ కొందరు గొర్రెలు కాసే కుర్రాళ్ళు అతని కెదురు వచ్చి, "అయ్యా, మీరేనా యువరాజుగారు? అయితే ఈ వనంలో ఉండే దేవత మీతో ఒక మాట చెప్పమన్నది. ఇటుగా పోతే మీకు వేటకు అనుకూలంగా ఉంటుందిట. ఆవిడ తమతో చెప్పమన్నది, మేం చెప్పాం," అన్నారు.

వాళ్ళతో ఆ మాట చెప్పినది మంజరే అయి ఉంటుందనీ, ఆమె ఈ అరణ్యంలో తన కోసం వేచి ఉండవచ్చుననీ ఆశపుట్టి, ధీరమతి వాళ్ళు చూపిన దిక్కుగా బయలుదేరి, చీకటి పడే వేళకు ఆమె ఉండే పొదరిల్లు పట్టుకున్నాడు.

ఆ కుర్రవాళ్ళు సరేనన్నారు. మంజరి అరణ్యంలోకి వెళ్ళిపోయి అక్కడ ఒక మంచి పొదరిల్లు చూసుకుని, ధీరమతి కోసం ఎదురుచూస్తూ ఉండసాగింది.

తన పెంపుడు కూతురు మంజరి వెళ్ళి పోయిందని తెలిసి సామంతు, రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, యువరాజును ఎందుకు నిష్కారణంగా ఖైదుచేస్తారు? మంజరి దేశం విడిచి వెళ్ళిపోయింది. ఆమె యువరాజుకు కనబడే అవకాశంలేదు," అని చెప్పాడు.

రాజు యువరాజును ఖైదు విడిపించాడు.

ధీరమతికి జనంమధ్య ఉండ బుద్ధి పుట్టక, గుర్రమెక్కి, నగరందాటి, అరణ్యం

ఎంతో కాలానికి తిరిగి ఒకరి నొకరు చూసుకుని వాళ్ళు అపారమైన ఆనందం పొందారు, కాని వాళ్ళు ఆ వనంలో ఉండటం ప్రమాదకరం. "మీ నాన్నగారి మనుషులు నీ కోసం వెతుకుతూ వచ్చి నన్ను చూశారంటే నన్ను నిలువునా తగలేస్తారు," అన్నది మంజరి.

మర్నాడు తెల్లవారు జామునే మంజరిని తన గుర్రం మీద ఎక్కించుకుని సముద్ర తీరాని కేసి బయలుదేరాడు ధీరమతి. అదృష్టవశాత్తూ వారికి, గజద్వీపానికి



పోతున్న పడవ ఒకటి రేవులో కనిపించింది. వాళ్ళు దానిలో ఎక్కి గజద్వీపానికి వెళ్ళి, అక్కడి రాజుకు అతిథులుగా కొంతకాలం సుఖంగా గడిపారు.

అంతలో ఒకనాడు వ్యాఘ్రద్వీపరాజు తన నౌకలలో సైనికులతో సహా వచ్చిపడి గజద్వీపాన్ని కొల్లగొట్టించాడు. అతని సైనికులు బందిపోటుల్లాగా దొరికినంత సొమ్ము దోచి, అందినంత మందిని పట్టుకుని తమ నౌకలను చేరుకున్నారు. అలా వాళ్ళకు చిక్కిన వారిలో ధీరమతీ, మంజరీ కూడా ఉన్నారు. ఈవిధంగా దొరికిన మనుషులను వాళ్ళు బానిసలుగా ఉంచుకునేవారు.

సైనికులు తమకు దొరికిన వారిలో మంజరిని తమ రాజుగారికి కానుకగా యిచ్చి, ఆయన నౌకలోకి ఎక్కించారు. ధీరమతిని వేరొక నౌకలోకి ఎక్కించారు. నౌకలు గజద్వీపం నుంచి వ్యాఘ్రద్వీపానికి వెళ్ళే దారిలో ఉప్పెన వచ్చి, ధీరమతి ఉండిన నౌక మిగిలిన వాటి నుంచి వేరుపడి, విక్రమపుర సమీపంలో గల కొండలకు కొట్టుకుని బద్దలయింది.

కొద్దిరోజుల క్రితమే తన తండ్రి పోయాడనీ, తన కోసం తెగ వెతుకుతున్నారనీ ధీరమతి తెలుసుకున్నాడు. అతను అతి




వేగంగా తన నగరానికి తిరిగివెళ్ళి, రాజుగా పట్టాభిషేకం చేసుకున్నాడు.

నిజానికి మంజరి కూడా తన దేశం చేరుకున్నది. ఆమె ఎక్కిన ఓడ వ్యాఘ్రద్వీపాన్ని సమీపించేటప్పుడు ఆమె, "ఇదంతా నాకు తెలిసిన చోటేనే!" అని ఆశ్చర్యపడింది.

అది చూసి వ్యాఘ్రద్వీపరాజు ఆమె పుట్టుపూర్వోత్తరాలు విచారించగా, మంజరి తన కుమార్తెనని ఆయనకు తెలిసిపోయింది. ఆమెను పదిహేనేళ్ళ క్రితం సముద్రపు దొంగలు ఎత్తుకుపోయారు. వాళ్ళ నుంచే సామంతుడామెను కొనుక్కున్నాడు.



ఏనాడో పోయిన తన కుమార్తె తిరిగి దొరికినందుకు వ్యాఘ్రద్వీప రాజు పెద్ద ఎత్తున ఉత్సవాలు జరిపించి, ఆమె పెళ్ళి గురించి తన భార్యతోనూ, మంత్రులతోనూ ఆలోచనలు సాగించాడు.

తన తల్లిదండ్రులను చేరుకున్న సంతోషం మంజరికి దక్కలేదు. ఆమెకు, ధీరమతి ఏమయాడో నన్న విచారం తప్ప మనసులో మరొకటిలేదు. అందుచేత ఒక నాడు మగవేషం వేసుకుని, ఎవరికీ చెప్ప కుండా ఇంటి నుంచి బయలుదేరి, వర్తకుల పడవలలో ఒక ద్వీపం నుంచి, ఇంకొక ద్వీపానికి ప్రయాణం చేస్తూ, తన ప్రేమ కథను ఒక పాటగా తయారు చేసుకుని, కాలక్రమాన మంజరి విక్రమపురం చేరింది.

ఆ దేశంలో అడుగుపెట్టగానే ఆమెకు, ధీరమతి రాజుగా ఏలుతున్నట్టు తెలిసింది. ఆమె ఎలాగో రాజదర్శనం చేసుకుని, ధీరమతి ముందు తాను తయారు చేసిన పాట పాడింది. అది తన ప్రణయగాథేనని తెలుసుకుని ధీరమతి ఆత్రంగా, "చివరకు మంజరి ఏమయింది? ఎవరిని పెళ్ళా డింది?" అని అడిగాడు.

"మంజరి మరెవరిని పెళ్ళాడుతుంది? మరొకరిని ఎలా పెళ్ళాడుతుంది?" అన్నది మగవేషంలో ఉన్న మంజరి.

"అయితే తన ప్రియుడి దగ్గిర కెందుకు పోదు? వాడు మాత్రం మరొకతెను ఎలా పెళ్ళాడతాడు?" అన్నాడు ధీరమతి, బాధపడుతూ.

"అందుకే మంజరి తన ప్రియుణ్ణి వెతుకుతూ సముద్రాలు దాటి వచ్చింది... నేనే మంజరిని!" అన్నది మంజరి.

ధీరమతి పొందిన ఆనందానికి హద్దులు లేవు. అతను అప్పటి కప్పుడే తమ వివాహా నికి ఏర్పాట్లు చేయించి, ఆమెను తన రాణిగా చేసుకుని, చాలాకాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.





# కృష్ణావతారం

కృష్ణుడికి యౌవనం సంప్రాప్తమయింది. అతని అందమూ, బలమూ వ్రేపల్లెలోని స్త్రీలనందరినీ సమ్మోహింపజేశాయి. అతను వేణువు ఊదితే వాళ్ళకు మతులు పోయేవి. తల్లిదండ్రులూ, భర్తలూ, బంధువులూ చివాట్లు పెడుతున్నా లక్ష్యపెట్టక, వాళ్ళు వేణునాదాన్నిబట్టి మందలు మందలుగా అతని దగ్గిరికి పోయేవాళ్ళు, అతనితో విచ్చలవిడిగా విహరించేవాళ్ళు. ఈ ఆడ మూకను వెంట వేసుకుని కృష్ణుడు నృత్యాలు చేసేవాడు, పాటలు పాడేవాడు, యమునలో జలక్రీడ లాడేవాడు, దాగుడు మూతల లాటి ఆటలాడేవాడు. కృష్ణుడు వారితో అహోరాత్రాలు ఇలాటి క్రీడలలో గడపసాగాడు.

ఒకనాటి అర్ధరాత్రి, చుట్టూ వలయంగా గోపికలను నిలిపి, మధ్య తా నుండి ఆటల వేడుకలో ఉండగా అరిష్టు డనే రాక్షసుడు ఒక బలమైన ఆబోతు రూపం ధరించి పెద్దగా రంకెలు పెడుతూ కృష్ణుణ్ణి ధ్వంసం చెయ్యటానికి వచ్చాడు.

ఆ ఆబోతు ఆకారమూ, అది పెట్టే భయంకరమైన రంకెలూ చూసి గోపికలు భయపడి కళ్ళు మూసుకుని, కృష్ణుడి చాటుకు వెళ్ళారు.

భయపడ వద్దని కృష్ణుడు గోపికలకు ధైర్యం చెప్పి, మీదికి వస్తున్న ఆ ఆబోతు కొమ్ములు రెండూ గట్టిగా పట్టుకుని కదల లేకుండా చేసి, బలంగా దాని మెడ మెలి పెట్టి, ఒక్క తోపు తోశాడు.

9. కంసుడి ఆహ్వానం



నోటా, ముక్కులా రక్తం కక్కుతూ ఆ ఆబోతు చచ్చి పడిపోయింది. అప్పటికి గోపికలకు ధైర్యం వచ్చి, అతన్ని చుట్టు ముట్టి, ప్రశంసించారు.

ఇక్కడ కృష్ణు డిలా ఉంటే, మధురా పురంలో కంసుడు నిత్యమూ చస్తున్నాడు. అతని మనస్సంతా వికలమయింది, జీవ చ్ఛవం లాగా తయారయాడు. ఒక నాడతను తన సభాభవనానికి ఉగ్రసేనుణ్ణీ, వసు దేవుణ్ణీ, సత్యకుణ్ణీ, అంధకుణ్ణీ, కంపకుణ్ణీ, దారుకుణ్ణీ, విపృథుణ్ణీ, బభ్రుణ్ణీ తదితర యదు, భోజ ప్రముఖులను పిలిపించి, ఇలా అన్నాడు:



"మీ రందరూ గొప్ప మేధావులు, జ్ఞానులు, ఎలాటి సమస్యలనైనా పరిష్క రించ గలవారు, నాకు ఎంతో మేలు చేయా లనే దృష్టిగలవారు. అయినప్పటికీ, నా కిప్పు డొక పెద్ద ప్రమాదం వచ్చిపడినా, ఏ కారణం చేతనో మీరు చూస్తూ ఉండి పోయారు. నందగోపుడికి పుట్టిన కృష్ణుడనే వాడు నన్ను నిర్మూలించటానికి సిద్ధంగా ఉన్నాడు. వాడు అశ్రద్ధ చేసిన జాడ్యంలాగానూ, గాలి తోడైన మేఘంలాగానూ, విషవృక్షంలాగానూ దిన దినమూ వృద్ధి పొందుతున్నాడు. వా డెలాటి అంశతో పుట్టినదీ, ఎంత ఆలోచించినా అంతుపట్టకుండా ఉన్నది. ఏ దేవతాంశనో పుట్టాడేమో ననిపిస్తుంది. ఎందుకంటే వాడి చరిత్రంతా అమానుషంగానే ఉన్నది. చెబుతాను వినండి."

కంసుడు వారితో కృష్ణుడి పనులన్నీ వివరించి చెప్పాడు: సరిగా కళ్ళు తెరవని దశలోనే పూతనను చంపాడు; బోర్లా పడటం కూడా రాని రోజుల్లోనే బండిని ఒక్క తన్నుతో తుత్తునియలు చేశాడు; తప్పటడుగులు వేసే ఈడున జంట మద్ది చెట్లకు రోలు తగిలించి లాగి, కూల్చేశాడు; ఒక టేమిటి? ఆరోజు కారోజు గడుస్తున్న కొద్దీ కాళియుణ్ణి మర్దించాడు, ప్రలంబుణ్ణీ,

ధేనుకుణ్ణీ చంపించాడు, అరిష్టుణ్ణి చంపాడు. బాల్యం మాట దేవు డెరుగు, వయసు వచ్చిన వాళ్ళు మాత్రం ఇలాటి పనులు చేయ గలిగారా? ఏడురోజులు ఎడాతెరిపి లేకుండా కుంభవర్షం కురిస్తే కొండను అవలీలగా గొడుగల్లే ఎత్తేసి పట్టుకున్నాడు. ఆ అమా నుషకార్యం ఒక్కటే చాలు, మిగతావి చెప్పుకో నవసరం లేదు.

ఇదంతా చెప్పి కంసుడు వారితో మళ్ళీ ఇలా అన్నాడు:

"ఇక మిగిలి ఉన్న రాక్షసుడు కేశి ఒకడే. కేశి కూడా కృష్ణుడి చేత చచ్చా డంటే ఆ తరవాత వచ్చేది నా వంతే. చంప మరిగినవాడు నన్ను మాత్రం విడిచి పెడతాడా? వట్టిది. కృష్ణుడే అనుకుంటే వాడంతవాడు వాడి అన్న బలరాము డొకడు కూడా ఉన్నాడు. అసలు జరిగిన దేమిటో నారదుడు నాకు చెప్పాడు. దేవకీదేవి అర్ధ రాత్రి వేళ కొడుకును కంటే, ఈ వసుదేవుడు వాణ్ణి తీసుకుపోయి నందగోపుడి భార్య పక్కలో పెట్టి, ఆమె కన్న ఆడపిల్లను తెచ్చి తన భార్య పక్కలో పెట్టాడు. అది కూడా నాకు అందకుండా ఆకాశాని కెగిరి, వింధ్యవాసినీ దేవత అయి కూర్చున్నది. ఇంతకాలంగా అయిన వాడల్లే నటిస్తూ



వసుదేవుడు నా కింత ద్రోహం చేశాడు. నేను ఎంత మర్యాద చేశానో, నాకు అంత గొప్ప ద్రోహం చేశాడు."

తరవాత కంసుడు వసుదేవుడి కేసి తిరిగి, "నీ ఆలోచన నాకు తెలుసు: నీ కొడుకు చేత నన్ను చంపించి, వాణ్ణి మధురకు రాజు చేసి ఏలింతా మనుకుంటున్నావు. కాని నీ కొకటి తెలీదు: ఇంద్రుడే వచ్చినా నన్నేమీ చెయ్యలేడు. అక్కడే భ్రమపడ్డావు. చక్రవర్తి వంశంలో పుట్టావు, చిన్నతనం నుంచీ మా తండ్రి దగ్గిర పెరిగావు. మా చెల్లెల్ని పెళ్ళాడి, యాదవు లందరికీ గురు స్థాన మైనావు; ఇలాటి నీచమైన పని



చేస్తావా? నీ పాతకం నీకే ఉండనీ, నేను నిన్ను చంపను. బంధు మిత్ర బ్రాహ్మణ హత్యలు చేసినవాణ్ణి కాను, చేయను కూడా. నిన్ను వెళ్ళగొట్టవచ్చు, కాని అది కూడా చెయ్యను. నీ అంతట నువు పోతేపో, ఉంటే ఉండు," అన్నాడు.

తరవాత కంసుడు భోజవంశం వాడైన అక్రూరుడి కేసి తిరిగి, "నేను ఈ యేడు నా ధనుస్సుకు గొప్ప ఉత్సవం చెయ్య బోతున్నాను. దానికి ఎక్కడెక్కడి రాజులూ వస్తారు. చాలా రోజులపాటు విందు చెయ్య వలసి ఉంటుంది. గోకులం నుంచి పుష్కలంగా పెరుగూ, పాలూ, నెయ్యీ, అడవి



తేనే కావలసి వస్తుంది. అందుచేత నువు గోకులానికి వెళ్ళి ఇవన్నీ వచ్చేటట్టు ఆజ్ఞ ఇయ్యి. తిరిగి వచ్చేటప్పుడు నంద గోపుణ్ణీ, అతని కుటుంబాన్నీ వెంట బెట్టుకురా. నా మేనల్లుళ్ళయిన బలరామకృష్ణులను చూడాలని నాకు మహా వేడుకగా ఉంది. వాళ్ళు మహా బలులట. నేను తమను చూడాలని ఉవ్విళ్ళూరుతున్నానని నమ్మకం కలిగే లాగా చెప్పి, వాళ్ళను వెంట బెట్టుకురా. నా దగ్గిర ఇద్దరు మేటి మల్లు లున్నారు. వీళ్ళకూ, వాళ్ళకూ పోటీ పెట్టి వాళ్ళ బలపరాక్రమా లెలాటివో చూస్తాను. వాళ్ళిద్దరినీ తెచ్చావంటే నాకు మహోపకారం చేసిన వాడవవుతావు. వసుదేవు డేమన్నా చెవిలో ఊదుతాడేమో, అదేమీ వినిపించుకోక, నువు వెంటనే బయలుదేరు," అన్నాడు.

కంసుడి పరివారంలో కృష్ణుణ్ణి భగవంతుడి అవతారంగా భావించే వారు చాలా మంది ఉన్నారు. వారిలో అక్రూరు డొకడు. కృష్ణుణ్ణి కళ్లారా చూసి తరించే అవకాశం దొరికినందుకు లోపల పొంగి పోతూ, అక్రూరుడు కంసుడి వద్ద సెలవు పుచ్చుకుని అప్పటికప్పుడే రథం ఎక్కి, వ్రేపల్లెకు బయలుదేరాడు.







మొత్తం మీద కంసుడు వసుదేవుణ్ణి గురించి అంతమంది మధ్యా అలా మాట్లాడటం పెద్దల కందరికీ కర్ణకఠోరమనిపించింది. వారిలో వృద్ధుడైన అంధకుడనే యాదవుడు నిర్భయంగా ముందుకు వచ్చి, కంసుడితో ఇలా అన్నాడు:

"నువ్వన్న మాటలు రాజోచితమైనవి కావు. ముందూ వెనకా ఆలోచించకుండా పెద్దవాణ్ణి పట్టుకుని ఎంతెంతమాట లన్నావు! ఇలాటి ప్రవర్తనతో నీ తల్లిదండ్రులకూ, వంశానికీ తీరని కళంకం తెచ్చావు. వసుదేవుడు తన కొడుకును దాచాడని తప్పు పట్టుతున్నావా? తల్లిదండ్రులు తమ సంతానాన్ని కాపాడుకోవటానికి అడ్డమైన అగచాట్లూ పడరా? నీ తల్లిదండ్రులు నీ కోసం ఏ పాట్లూ పడకుండానే నువ్వింత వాడివయావా? నీ ధోరణి మాకు ఏమీ బాగా లేదు. నీతో తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోలేక పోవటం మాదే బుద్ధి తక్కువ. మా కన్న ఆ అక్రూరుడు చాలా అదృష్టవంతుడు. కృష్ణుణ్ణి చూసి వచ్చిన అక్రూరుణ్ణి చూసి మేము కూడా పవిత్రుల మవుతాం. కృష్ణుడు యిక్కడికి వచ్చాడంటే నీకు చావు తప్పదు. నీ కెవరూ అడ్డపడలేరు. అందుచేత నువే ముందు గోకులంలో వున్న కృష్ణుడి వద్దకు వెళ్ళి, అతన్ని మంచి చేసుకుని బాగుపడు."

అంధకు డిలా అనే సరికి పట్టరాని కోపం వచ్చి, కంసుడు చివాలున లేచి వెళ్ళిపోయాడు. మిగిలిన వారు కూడా తమతమ ఇళ్ళకు వెళ్ళారు.

అక్రూరు డింకా గోకులం వెళ్ళక పూర్వమే కంసుడు కేశి అనే రాక్షసుణ్ణి బృందావనానికి పంపాడు. గుర్రం రూపు గల ఆ రాక్షసుడు బృందావనం చేరి, అక్కడి అరణ్యంలో మేతలు మేసే పశువులనూ, గోవులను కాసే వారినీ నాశనం చెయ్యసాగాడు. ఆ గుర్రాన్ని, భయంకర





మైన దాని అవతారాన్నీ చూస్తే గోకులాని కంతకూ దడ పుట్టుకొచ్చింది. ఆ గుర్రం పశువుల కండలు చీల్చి తినేది, వాటి రక్తం తాగేది. అది అరణ్యంలో ఎక్కడా ఒక్క మృగం లేకుండా చేసి గోపకుల నివాసాల కేసి వచ్చింది. దాన్ని అంత దూరంలోనే చూసి గోకులంలో వాళ్ళు కృష్ణుణ్ణి శరణు జొచ్చారు. కృష్ణుడు వాళ్ళకు భయపడ వద్దని చెప్పి, చప్పట్లు చరుస్తూ గట్టిగా కేక పెట్టి కేశిని కవ్వించాడు.

ఇలా కవ్వించటం చూసి గుర్రానికి చాలా పౌరుషం వచ్చింది. కృష్ణుడి చేతిలో ఎలాటి ఆయుధమూ లేకపోయేసరికి దాని పౌరుషం



రెట్టింపయింది. అది పెద్దగా నోరు తెరిచి, దంతాలను భయంకరంగా బయట పెట్టి, పెద్దపెట్టున సకిలిస్తూ కృష్ణుడి పైకి వచ్చింది. అది వెనకకాళ్ళపై నిలబడి ముందు కాళ్ళెత్తి తన పైన దూకబోతే, కృష్ణుడు ఒడుపుగా పక్కకు తప్పుకుని, చప్పున తన చెయ్యి దాని నోట దూర్చి, దాని నాలుక మొదలంట పట్టుకున్నాడు.

వెంటనే గుర్రం అట కట్టింది. అది, కృష్ణుడి పట్టు తప్పించుకోలేక, అతన్ని కరవలేక, ఇంకేమీ చెయ్యలేక, కాళ్ళు నేల కేసి తాటిస్తూ, గుడ్లు వెళ్ళబెట్టి అతి హీన స్థితిలో పడింది. కృష్ణుడు దాని నాలుక పెరికి, కంఠం చీల్చి, పళ్ళు రాల్చి, దాని డొక్కలో చెయ్యి దూర్చి కెలికి, మహాదారుణంగా చంపేశాడు.

గోకులంలో వాళ్ళంతా పెద్దనిట్టూర్పులు విడిచారు. అందరూ చుట్టూరా చేరి అతన్ని ఎంతగానో అభినందించారు. గోపికలు పూల దండలు తెచ్చి కృష్ణుడి మెడ నిండా వేశారు.

అప్పుడు నారదుడు అదృశ్యంగా ఆకాశంలో ఉండి, తన పేరు చెప్పుకుని కృష్ణుడితో, "నాయనా, కలహప్రియుణ్ణయిన నేను నీ యుద్ధం చూడటానికి ప్రత్యేకంగా దేవలోకం నుంచి వచ్చాను. నువు చూపిన





ఈ పరాక్రమం ఇంద్రుడికి చెల్లేను, శివుడికి చెల్లేను, మరెవరికీ సాధ్యం కాదు. ఆ ఇంద్రుడే అయినా ఎదుర్కోలేని ఈ కేశిని సునాయాసంగా చంపావు. వీణ్ణి చంపి నందుకు నువు కేశవు డనే పేరుతో ప్రసిద్ధుడి వవుతావు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఈ లోపల అక్రూరుడు మధుర నుంచి, మేలైన గుర్రాలను పూన్చిన రథంలో బయలుదేరి, ఎక్కడా ఆగకుండా సాయం కాలం వేళకు వ్రేపల్లె చేర వచ్చాడు. సూర్యాస్తమయమై, చీకట్లు కమ్ముతూం డగా, వాటిని చెదరగొట్టుతూ చంద్రుడు ఉదయించాడు. గోకులం సందడిగా ఉన్నది. ఎక్కడ చూసినా వేలకొద్దీ గోవులు. గోప కులు వాటిని పేర్లు పెట్టి పిలుస్తున్నారు. పాలుపితికే ధ్వనులు వినబడుతున్నాయి. ఇలా కోలాహలంగా ఉన్న గోకులం మధ్యకు అక్రూరుడు రథాన్ని తోలు కొచ్చి, అంత దూరాన బలరామకృష్ణులను చూసి పరమా నంద భరితుడయాడు. అతను చప్పున కృష్ణుణ్ణి సమీపించి తన గోత్రనామాలు చెప్పుకుని, కృష్ణుడి పాదాలకు నమస్కారం చేశాడు. కృష్ణు డతన్ని లేవనెత్తి కౌగిలించు కుని, కుశల ప్రశ్నలు వేసి, బలరాముడి వెంట అతన్ని తన ఇంటికి తీసుకుపోయాడు.

అక్రూరుడి కోరిక మీద నందగోపుడు మొదలైన పెద్దలందరూ అతని వద్దకు వచ్చారు. వారితో అక్రూరు డిలా అన్నాడు:

"కంసమహారాజు తన ధనువుకు గొప్పగా ఉత్సవం చేయ తలపెట్టాడు. మీ రందరూ మీరు మీరు చెల్లించ వలసిన కప్పాలు తీసుకు వచ్చి చెల్లించండి, విందు లకు గాను నేతులు మొదలైనవి తీసుకు రండి. ఈ ఉత్సవానికి ఈ బలరామ కృష్ణులు కూడా రావాలని కంసమహారాజు మహావేడుక పడుతున్నాడు. మీరు వెంటనే ప్రయాణం కట్టండి. నేను వీ రిద్దరినీ రథం మీద తీసుకుని బయలుదేరుతాను."





# అరణ్యపురాణం

## 12

మౌగ్లీ తన మిత్రు లందరినీ చూశాడు. అతని కళ్ళు చెమ్మగిల్లాయి. అతను తన అన్నలను సమీపించి, ఒక కాలి మీద మోకరించి, "ఏం చెయ్యాలో నాకు తెలియదా? నా కేసి ఒకసారి చూడండి!" అన్నాడు. వాళ్ళు అతని కేసి చూడలేక పోయారు. "చెప్పండి, మన అయిదుగురిలో నాయకు డెవరు?" అని మౌగ్లీ వాళ్ళ నడిగాడు.

"నువే, బుల్లితమ్ముడూ," అంటూ పెద్దన్న మౌగ్లీ పాదం నాకాడు.

"అయితే నా వెంట రండి," అంటూ మౌగ్లీ దారితీశాడు. మిగిలిన నలుగురూ తోకలు ముడిచి అతని వెనకాలే నడిచారు.

"అరణ్య శాసనాన్ని మించిన శాసనాలొచ్చాయి, భాలూ," అంటూ బాఘీర వాళ్ళ వెనకగా బయలుదేరాడు.

మౌగ్లీ నిశ్శబ్దంగా, బలదేవుడు వచ్చే దారికి అడ్డంగా దారితీసి కొంత దూరం వెళ్ళాడు. అతను పొదలను చేతితో అడ్డం తొలగించే సరికి, భుజాన తుపాకీ పెట్టుకుని బలదేవుడు వస్తూ కనబడ్డాడు.

మౌగ్లీ గ్రామం నుంచి వచ్చేటప్పుడు షేర్‌ఖాన్ చర్మం బరువు మోస్తూ ముందు నడిచాడు. అకేలా, అన్నా అతని వెనకగా నడిచారు. ముగ్గురి పాదాల గుర్తులూ స్పష్టంగా తెలిశాయి. అయితే అకేలా ఆ గుర్తులను కలగాపులగం చేసిన చోటికి చేరేసరికి బలదేవుడికి అయోమయమై పోయింది. ఆ ముసలాడు ఒక చోట కూర్చుని దగ్గి, గొంతు సవరించుకుని, దారి కోసం అటూ ఇటూ చూడసాగాడు. రాయి వేటు దూరంలో తనను పన్నెండుకళ్ళు గమనిస్తున్న సంగతి బలదేవు డెరగడు.

అట్ట చివరి బొమ్మ



కావాలంటే తోడేలు ఎంత నిశ్శబ్దంగానైనా మసలగలదు. తోడేళ్ళ దృష్టిలో మౌగ్లీకి ఆశక్తి లేకపోయినా, అతను కూడా నీడ కదిలినంత నిశ్శబ్దంగా కదల గలడు. మౌగ్లీ, తోడేలన్నలూ బలదేవుడికి అయిదు పక్కలా చేరి యథేచ్ఛగా మాట్లాడుకున్నారు. వాటి కంఠధ్వని మనిషికి వినిపించదు.

బలదేవుడు ముందుకు వంగి, తొంగి తొంగి చూస్తూ, ఏదో గొణిగాడు.

"ఏమి టంటాడు, వాడు?" అన్నాడు పెద్దన్న మౌగ్లీతో.

"తన చుట్టూ తోడేళ్ళమంద నృత్యం చేసినట్టున్నదిట. ఇటువంటి జాడ తన జన్మలో ఎన్నడూ చూడలేదుట. తనకు ఎగరొప్పుగా ఉందిట," అన్నాడు మౌగ్లీ.

"జాడ చిక్కే లోపల ఎగరొప్పు దిగి పోతుందిలే. ఏమిటా బక్కవాడు చేస్తున్న పని?" అని బాఘీర అడిగాడు.

"ఏముంది? తినటమో పొగ పీల్చటమో. మనుషుల నోళ్ళు క్షణం ఊరుకోవు," అన్నాడు మౌగ్లీ, బలదేవుడు తన పైపులో పొగాకు దట్టించటం చూసి.

అవసరమైతే బలదేవుణ్ణి పసిపట్టడం కోసం అందరూ ఆ పొగాకు వాసన మూచూశారు.

ఇంతలో కొందరు బొగ్గుల వాళ్ళు అటుగావచ్చి, బలదేవుణ్ణి పలకరించారు. ఎందుకంటే, ఇరవైమైళ్ళ కైవారంలో బలదేవుడికి గొప్ప వేటగాడుగా ఖ్యాతి ఉన్నది. అందరూ కూచుని పొగతాగుతూంటే, బలదేవుడు వాళ్ళకు మౌగ్లీ అనే రాకాసి పిల్లవాడి కథను, అనేక కల్పనలతో చెప్పాడు; ఇదంతా చూడటానికి బాఘీర మొదలైన వాళ్ళు మరింత దగ్గిరగా జరిగారు. షేర్ ఖాన్‌ను నిజంగా చంపినది బలదేవుడేట. అప్పుడు మౌగ్లీ తోడేలుగా మారిపోయి, గంటల తరబడి బలదేవుడితో హోరాహోరి పోరాడి, మళ్ళీ మనిషిగా మారి

పోయి, బలదేవుడి తుపాకికి మంత్రం వేశాడట. మంత్రం వేసే సరికి, మౌగ్లీకి గురి పెట్టిన తుపాకీ గుండు కాస్తా పక్కకు తిరిగి పోయి, బలదేవుడి గేదెనే కొట్టిందట. సీయోనీలో బలదేవుడి లాటి గుండెధైర్యంగల వేటగాడు మరి లేడుగదా అని, గ్రామస్థులంతా కలిసి, మౌగ్లీని చంపి రమ్మని అతన్ని పంపారట. అంతటితో ఊరుకున్నారా? ఆ గ్రామస్థులు ఈ రాకాసి పిల్లాడి తల్లినీ, తండ్రినీ—అంటే, మెస్సువానూ, ఆమె భర్తనూ—వాళ్ళ గుడిసెలోనే ఖైదు చేసేశారట. చిత్ర హింసలు పెట్టి వాళ్ళ చేత నిజం చెప్పించి—అంటే వాళ్ళు కూడా మాయలూ మంత్రాలూ నేర్చిన వాళ్ళేనని ఒప్పించి—ఆ తరవాత సజీవంగా దహనం చెయ్యబోతున్నారట.

"ఎప్పుడు జరుగుతుంది, బాబయ్యా, ఈ సజీవ దహనం?" అని బొగ్గులవాళ్ళు అడిగారు. ఈ వినోదం కళ్ళారా చూడాలని వాళ్ళ ఆశ.

"ముందీ అడివి వెధవ చావాలి. అందు చేత, నేను తిరిగి వెళ్ళేదాకా జరగదు," అన్నాడు బలదేవుడు. వాళ్ళను తగలేసి నాక, వాళ్ళ పొలాలూ, గేదెలూ ఊళ్ళో వాళ్ళు పంచుకుంటారనీ, మెస్సువా భర్తకు



దివ్యమైన గేదెలున్నాయనీ కూడా బలదేవుడు చెప్పాడు. "అయితే, బాబయ్యా, ఈ మాట ఇంగిలీషు వాళ్ళకు తెలిస్తే చిక్కేనేమో? ఆ ఇంగిలీషు వాళ్ళకు మతిసుతీ లేదుటగా? వాళ్ళు మాయదార్లని మంచిగా తగలెట్టినా ఊరుకోరంటారే?" అన్నారు బొగ్గుల వాళ్ళు.

"దాని కేముందిలే? మెస్సువా, ఆమె మొగుడూ పాము కరిచి చచ్చారని గ్రామాధికారి రిపోర్టు రాసేస్తాడు. ఆ ఏర్పాటంతా ఏనాడో అయింది. మిగిలి ఉన్నదల్లా ఈ రాకాసి పిల్లాణ్ణి చంపటమే. అలాటి వాడు మీకేమైనా కనిపించాడా?" అన్నాడు బలదేవుడు.

బొగ్గుల వాళ్ళు భయంగా చుట్టూ కలియ జూసి, "దేవుడి దయవల్ల మేం చూడలేదు. కాక పోయినా, బాబయ్యా, నీ బోటి ధైర్య శాలికి వాడు కనిపించ కెక్కడికి పోతాడులే! మేం మీ గ్రామానికి పోయి ఆ మాయలమారి దాన్ని చూస్తాం," అన్నారు.

"ఆ రాక్షసివెధవను చంపటం నా తక్షణ కర్తవ్యమే ననుకోండి. అయినా మీ లాంటి నిరాయుధులు తోడు లేకుండా అడవి దాటటం అంత క్షేమం కాదు. ఆ తోడేలు పిశాచం ఏ క్షణాన అయినా మీ ముందు ప్రత్యక్షం కావచ్చు. అందుచేత నేను మీ వెంట వస్తాను. ఆ రాక్షసివెధవ గాని ఎదురు పడ్డట్టాయెనా, సీయోనీలో కెల్లా గొప్ప వేటగాడైనవాడు ఆ పరిస్థితిలో ఏం చేస్తాడో మీరు కళ్ళారా చూడవచ్చు. నాకు ఎలాటి అపాయమూ రాకుండా ఆ బ్రాహ్మడు మహత్తరమైన తాయెత్తు ఒకటి నా కిచ్చాడుగా," అన్నాడు బలదేవుడు.

"ఏమిటంటాడు? ఏమిటంటాడు? ఏమిటంటాడు?" అని తోడేళ్ళు క్షణక్షణమూ అడుగుతూనే ఉన్నారు. మౌగ్లీ వాళ్ళకు తాను వినేదంతా చెప్పాడు. మాయలమారి అనే దేమిటో అతనికి అంతు చిక్కలేదు. తనను పోషించిన భార్యాభర్తలు బోనులో పడ్డారని అతను వాళ్ళకు చెప్పాడు.

"మనిషికి మనిషి బోను పెట్టటమా?" అన్నాడు బాఘీర.

"ఏమో మరి, అలాగే అంటున్నాడు. నా కా సంభాషణ పూర్తిగా అర్థంకావటం లేదు. మెస్సువాకూ, ఆమె భర్తకూ నాతో ఏం సంబంధమని వాళ్ళను బోనులో బంధించినట్టు? ఎర్రపువ్వు ప్రసక్తి ఎందు కొస్తున్నది? ఏమైనా బలదేవుడు తిరిగి వెళ్ళిన దాకా మెస్సువాను ఏమీ చెయ్యరుట. కనక—" అంటూ, మౌగ్లీ తన కత్తి పిడిని వేళ్ళతో నిమురుతూ తీవ్రంగా ఆలోచించాడు. —(ఇంకావుంది)



# 66. వెనిస్ జలవీధులు

వెనిస్ (ఇటలీ) నగరంలో కొంత భాగంలో కాలువలే వీధులు. యాత్రికులు ఈ కాలువల వెంబడి "గొండోలా" లలో ప్రయాణం చేసి ఆనందిస్తారు. కాలువలపై అనేక వంతెన లున్నాయి. చిత్రంలో కనిపించేది "నిట్టూర్పుల వంతెన." ప్రసిద్ధ ప్రపంచ యాత్రికుడు మర్కోపోలో ఇక్కడివాడే.



Photo by P. V. Subramanyam



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీవా నేనా ?

పంపినవారు :
పి. ఆర్. మూర్తి, గుంటూరు

Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీవే నేను!

పంపినవారు:
పి. ఆర్. మూర్తి, గుంటూరు

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 జులై నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : నీవా నేనా ?

రెండవ ఫోటో : నీవే నేను !

పంపినవారు : పోలంరాజు రాధాకృష్ణమూర్తి,
అరండల్ పేట, గుంటూరు - 2

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# యీ 'బ్రిజిల్' కొనల్ని భూత అద్దము క్రింద పోల్చి చూడండి



# బినాకా
## టూత్ బ్రష్

క్షేమకరమైన 'గుండ్రని బ్రిజిల్' కొనల'తోకూడి
REG. PAT. NO. 69453
చిగుళ్లను తెగనీయదు

## పరిశుభ్రముగా తోమండి
## క్షేమకరముగా తోమండి
## బినాకా తో తోమండి

CIBA

CIBA 67/83 Tel.

## బలము మరియు శక్తి కోసం!




## క్యాడ్‌బరీస్
# బోర్న్‌విటా

బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది. కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు, బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేట్‌లు, ఎముకలను దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!

Bensons/CP-579A/2 Tel

మంచికి మానవత్వానికి దారిచూపించే చిత్రం!



పద్మశ్రీ వారి

# ప్రాణమిత్రులు

నిర్మాత... వి. వెంకటేశ్వర్లు బి.ఎ. దర్శకత్వం... పి. పుల్లయ్య

కథ, మాటలు... ముళ్లపూడి వెంకటరమణ
సంగీతం... కె.వి. మహదేవన్





